స్వర్ణలత ప్రచురణ 11

# మధుకరి

రచయిత:

మధునాపంతుల
వెంకటసూర్యనారాయణమూర్తి

పబ్లిషర్సు:

స్వర్ణలతాగ్రంథమాల,
కాకినాడ.

కాకినాడముద్రాక్షరశాల, కాకినాడ.

1944



0-12-0

లేతవయస్సులో మమ్మల్నందర్నీ
మొన్ననే విడిచివెళ్లిన మా
మేనత్తకొడుకు అల్లంరాజు
వెంకటవిజయగోపాలరావుకి
అంకితం

కథకుడు:

మధునాపంతులవారు అయిదేళ్లనుంచి మీకందరికీ పరిచితులు. కాకినాడ నుంచి కొన్నాళ్లు వెలువడిన 'భారత్ మాత'కి సంపాదకులు. తరవాత 'దేశాభిమాని' దినపత్రికలోనూ, మద్రాసునుంచి మొన్నటివరకూ వెలువడిన 'తెలుగుటాకీ' పత్రికలోనూ సహాయసంపాదకులుగా పనిచేసారు. ఇప్పుడు 'ప్రజాబంధు' వారపత్రికలో సహాయసంపాదకులుగా ఉన్నారు. మొత్తంమీద పేరు మొదట్నుంచి పత్రికాసంపాదకులు.

బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారికి కొంతకాలం గురువులుగా ఉన్న "మధునపంతుల సూరయ్యాబుధుడు" వీరి తాతగారు. స్వగ్రామం పల్లిపాలెం.

రామమోహన్.

# శి వా జీ

నేను ఎన్నోసార్లు ఆమెను వారించాను — స్నేహితుల్తో అంతగా తిరగడం మానమని.

ఆమె నన్ను తప్పుగా అర్థం చేసుకుంది. నిర్బంధనలు ఇలాంటివి తనకిష్టం లేదని చెప్పింది.

నేనేం నిర్బంధనలు పెట్టాను ? జీవితాంతంవరకూ నా సహాధ్యాయిగా ఉండడానికి ఎంతో ఆసుర్దాపడుతున్నానని చెప్పిన ఆమె నన్నొదిలి నా ఎరుకుకుండా మిగతా మిత్రుల్తో షికార్లకి వెళ్ళడం నన్నెలాంటి ఊహాలకి లాక్కెళ్ళుతుందో అర్థం చేసుకోలేదూ ? నన్నే ప్రేమించి నన్నే పెళ్ళాడి నాతోటే జీవయాత్ర సాగించడానికి ఇష్టపడుతూన్న ఆమె నన్నువదిలి నేను లేని మిత్రులసంఘంలో తిరగడానికి ఆనందంగా ఉంటే నా ప్రాముఖ్యత ఏం స్పష్టపరుస్తోంది ?

నేనింక ఆమెతో వాదించటం లాభం లేనిపని అని ఊరుకుని నాదారినేను చూసుకోడానికి పట్టణం వచ్చేసాను.

ఆమె ఎన్నో ఉత్తరాలు వ్రాసింది. నాకు స్వార్థం ఎక్కువని, నాగరికతలోని అర్థాన్ని గ్రహించుకోలేననీ ఇరవై నాలుగు గంటలూ నాతోటే తిరుగగల స్త్రీనే ఎన్నుకోవటం మంచిదని భావిస్తున్న నా మనస్తత్వం మంచిదికాదని వ్రాసింది. నేను పరాక స్త్రీని ఎన్నుకోలేదని, నీ నడవడిక నాకు ఇష్టంగాలేదని, అంతకన్న ముఖ్యంగా నీనాలిక మంచిదికాదని నేను వ్రాశాను.

నేను పట్టణం వచ్చిన రెండు నెలలువరకూనే మా ఉత్తర ప్రత్యుత్తరాలు జోరుగా జరిగాయి. తర్వాత నేను కొత్తగా తీయబోతూన్న చిత్రంలో మునిగిపోవటంచేత నేనామెకు జవాబివ్వటానికి తీరుబడి లేకపోయింది.

ఆరేళ్ళనుంచి నేను చిత్రనిర్మాణ వ్యాపారంలో మునిగిపోతున్నాను. ఈ ఏడాది శివాజీ చిత్రాన్ని తయారుచెయ్యాలని ఎంతో ప్రయత్నం చేసాను. బాల్యంలోని శివాజీపాత్రకి చిన్న కుర్రాడు కావల్సి ఎన్నోపత్రికల్లో ప్రకటించాను. ప్రకటనలు చూసి చాలామంది కుర్రాళ్ళని తీసుకొచ్చారు. నాకునచ్చిన కుర్రాడు ఒక్కడూరాలేదు. నా నిరుత్సాహం పెరిగిపోతోంది. ఒక సుప్రసిద్ధయోధుని జీవితాన్ని వెండితెరకు అలంకారంగా ప్రసాదిద్దామన్న నా మహదాశయం నెరవేరదేమో అన్న భయం, విచారంకూడా కలిగింది. ఆ వీరునిచరిత్ర ప్రపంచానికి అర్పించడానికి ఎన్నో పెద్దఊహలు నాలో చిగురించినాయి. కాని సరియైనకుర్రాడు కనిపించలేదు.

పత్రికలందనిపల్లెల్లో నాకు కావల్సిన కుర్రాడు ఉండవచ్చునేమో అని ప్రచారకార్యక్రమాన్ని ఏర్పాటుచేసుకున్నాను.

రేపు ప్రయాణం. ఉదయం ట్రెయిన్‌లో నా అంతరంగిక కార్యదర్శి ప్రయాణసన్నాహాలన్నీ అతి తొందరగా చేస్తున్నాడు.

ఆఫీసులో కూచున్నాను. బంట్రోతు లోపలికివచ్చి "మీకోసం ఎవరోవచ్చారుబాబు" అన్నాడు.

"ఎవర"న్నాను.

"ఎవరో స్త్రీబాబూ."

"స్త్రీతో కుర్రాడెవడైనా ఉన్నాడా ?"

"లేదండి. ఒక్కామే వచ్చినిలుచుంది"

"లోపలికి రమ్మను" అన్నా నిరుత్సాహంతో.

ఆమె లోనికివచ్చింది.

నా ఆశ్చర్యానికి అంతులేదు.

"ఇలావచ్చావేం పద్మా" అని ప్రశ్నిస్తూ కూచోమని కుర్చీ చూపించాను.

"మిమ్మల్ని చూడడానికి ! మీకు నచ్చితే సహాయం చెయ్యటానికి" అంది.

"ఎలాంటి సహాయం ?"

"మీ చిత్రానికి కుర్రాడొకడు కావాలని ప్రకటించారు... ... ..."

"నువ్వో కుర్రాణ్ణి కూడా తీసుకొచ్చావా ?"

"ఆ—"

"వడే..."

"నా మకాందగ్గరే ఉన్నాడు."

"ఎక్కడ నీమకాం ?"

"ఆ బజార్లోని పెద్ద హోటల్లో."

"హోటల్లో ఎందుకు చేరావ్—నాకు ఉత్తరం రాయ లేకపోయావా ? నా మకాంలోనే ఉండొచ్చుకదూ—"

"మీ మకాంలో ఉండే యోగ్యతని పోగొట్టుకున్నాను- కట్టుకు వచ్చిన రెండుమూడు నెలలవరకూ మీ రీవద్మవి మచ్చి పోలేదు. తరవాత నా ఉత్తరాలకి—నేనేంతప్పుచేసానో నాకు తెలీదు కాని—సమాధానాల్లేవు."

"తప్పేకేమిటి పద్మా—నాభావాన్ని నీకు వెల్లడిచేసా ను. నన్ను నిర్బంధనలు శాసించేవానిగానూ, మగాళ్ళకి ఈర్ష్య సహజముగా వుంటుందనీ చెప్పేవ్. నేనుమాత్రం అలాంటి ఉద్దేశాల్లో లేకపోవటంచేత నీ మాటలు నీ నడవడిక నన్నిలా పట్నానికి ప్రయాణము కట్టించాయ్—."

"ఈ ఆరేళ్ళూ నా కీశిక్షచాలు—నామీద మీకుండే విశ్వాసాన్ని పోగొట్టుకోవడానికి నేనే కారకురాల్ని— మీ కన్యాయం చేద్దామన్న భావముతో నేను మిత్రుల్తో తిరగ టంలేదు— అప్పుడు నాకున్న స్వభావాన్ని విప్పిచెప్పడానికి అనుమతియ్యండి—"

"ఏమిటది ?"

"నేను మిమ్మల్ని కోరింది సుఖముకోసమే— నేను మిత్రుల్తో తిరగడం కాలక్షేపముకోసము. నా సుఖంకోసము వారనపేక్షించలేదు. నేనంతకన్నా వాళ్ళతో అనుభవిద్దామని

వాళ్ళని వెంటాడలేదు— మీరూ నేనూ ఓసారి సినిమాకి పో తూంటే సుశీల కనిపిస్తే ఆమెనుకూడా మనము ఆహ్వానించాము—ఆమెకూడా వచ్చింది మీకు జ్ఞాపకంఉందా? సుశీల మిమ్మల్నికోరే వచ్చిందా? అలాగే ఓమారు నే నాహ్వానించిన మూర్తికూడా వచ్చాడు మనతోటి—మూర్తి నన్నుకోరాడా? నేనతన్నికోరానా? సరదాగా కంపెనీ కీప్ చెయ్యడాని కేకదూ-వీరిద్దరూ వచ్చింది?"

"... ... ... ... ..."

"మిమ్మల్ని నేను అపార్థ చేసుకున్నానని మీరు తలుస్తున్నారు—ఆ ఉద్దేశాన్ని పోగొట్టడానికే జనింతగా మాట్లాడుతున్నాను—నిజం చెప్పండి—నిర్భయంగా అడుగుతున్నాను—మీరూ నేనూ ఒక ఇంట్లో వుండడం ప్రారంభించినదగ్గర్నుంచీ—మీరూ నేనూ కలిసి గడపని రాత్రి ఒక్కటి వుందేమో చెప్పండి—"

"... ... ... ... ..."

"నేను కేర్లెస్‌గా మాట్లాడతానన్న కోపముతప్ప నిజానికి మీకూ నామీద అనుమానం లేదనే అంటాను—"

"పద్మా—ఊరుకుందూ—ఇప్పుడు నాకు చెయ్యడానికి వచ్చిన సహాయము ఏమిటో చెప్పు..." కుర్రాణ్ణి తీసుకొచ్చావన్నావ్— చూడడానికి వస్తాను ఇప్పుడే—"

"ముందు నామరతు ఒకటి వినండి."

"ఏమిటది?"

"ఆకుర్రాడితో సినిమా సంగతి ఏమీ చెప్పనని వాగ్దానం చెయ్యాలి."

"అదేమిటి, ఒకవేళ కుర్రాడు నచ్చితే సినిమా సంగతే కదా కుర్రాడికి చెప్పాల్సింది."

"నచ్చినతరువాత కదా మీరు చెప్పేది— ముందే ఎందుకు చెప్పడం?"

"సరే అలాగే...కాని నీ కేమౌతాడు ఆకుర్రాడు"

"కాడు కే... ..."

పద్మ చెప్పింది నిజమేనా? ఆరేళ్ల కుర్రాడు కలిగాడా పద్మకి? కలిగితే నాదగ్గరికి తీసుకువచ్చే పరిస్థితి ఎందుకు వచ్చింది?

నా కేం సమాధానం తోచలేదు.

హోటల్ కి వెళ్ళాం. గదిలో కుర్రాడు లేడు. పద్మ ఇలా ప్రారంభించింది. "రఘూ! ఎన్నాళ్ళకి మనం ఒకగదిలో కలుసుకున్నాం! ఆరు యుగాలైనట్లుంది. ఇలాకూచో పూ!" అంటూ హోటల్ వాళ్ల మంచంమీద తను కూచుంటూ అంది.

కుర్రాణ్ణి తీసుకువచ్చినమాట పుల్ళక్కా అని నాకు అనుమానం వేసింది. నన్ను వశపర్చుకోడానికి పన్నినఎత్తు అని గట్టిగా అనుకున్నాను కాని దండేనికి వేలాడదీసిన చిన్నలాగు చిన్న చొక్కా కనిపించింది. పద్మ నావీపుమీద చెయ్యి వేసింది. నామనస్సు చల్లగా తేలికగా అయింది.

"కుర్రాడేడీ?" అన్నా. ఆమె చర్యకు ఎలాంటి సమాధానము ఇవ్వకుండా.

"వస్తాడు—కింద ట్రాములు, బస్సులు చూడ్డానికి పోయినట్టున్నాడు."

"పిలు..."

"నీకు చాలా తొందరగా ఉందే వాణ్ణి చూడ్డానికని. నిలబడి రాజూ అని కేకేసింది—డాబా చివరనుంచి "వస్తున్నా" అంటూ అరిచాడు.

రాజు వచ్చాడు. పద్మఒళ్లో వాలాడు కొత్తవ్యక్తిని నన్ను వెలవెలబోతూ చూడకుండా ధైర్యంగా 'ఎవర్రా వీడు' అన్నట్లు చూస్తున్నాడు. ఆ చూపులు నన్నెందుకో బంధించాయి. నాచేతులు సాగి కుర్రాణ్ణి ఇరికించుకున్నాయి ఎందుకో నాహృదయము ఆపిల్లాణ్ణి కోరింది. ముసిముసినవ్వులు పైకి వచ్చాయి.

"నీకుర్రాడేనా పద్మా? నిజంచెప్పు" అన్నా.

"మా పిన్ని" అన్నాడు వెంటనే రాజు.

"నాకూ కొడుకేకదూ" అంది నవ్వుతూ పద్మ.

"అవును" అన్నాను!

పద్మ "రాజూ—వెళ్ళిఆడుకో—లేకపోతే కిందకు వెళ్ళి ట్రాముల్ని చూస్తూనుంచో" అని రాజుని పంపేసింది.

రాజుని నా కొడుకుగా చేసుకోవాలని బుద్ధిపుట్టింది.

రాజులోని అందం వెయ్యిరెట్లుగా నన్ను నాకోరికని నెరవేర్చుకోమని ప్రోత్సహిస్తోంది.

"పద్మా—నిన్నొక్కటి అడుగుతాను—ఏమీ అనుకోవ్ కదా ?"

"ఏమిటది ?"

"రాజుని పెంచుకోవాలని ఉంది. రాజుని నాదగ్గరే ఉంచుకోవాలని ఉంది—"

"కుర్రాళ్లని పెంచుకోవల్సిన స్థితికి వచ్చారా మీరు?"

నాలోని నీరసగుణాన్ని వేలెత్తి చూపినట్లనిపించింది పద్మ సమాధానం.

"ఏమి అలాఅంటున్నావ్ ?"

"ఏమీలేదు—"

"ఏదో చెప్పు అయితే నాకు జవాబు—"

"రాజు నన్ను వదిలి ఉండలేడు...అదీగాక మీకే రాజునిస్తే మీరు సినిమాలో ప్రవేశపెడ్తారా ?"

"ప్రవేశపెట్టను—రాజు పాడైపోతాడు. ఒకవేళ శివాజీగా రాజుని ఉపయోగించుకున్నా నావాడైతే రాజు—రాజుకి సినిమానటన అధ్యాయాన్ని అంతటితో ముగిస్తాను..."

"అదేమిటి...మీవాడిగా రాజునిచేస్తే ఎలాగ ? రాజుని మీచిత్రంలో నటింపించి ప్రతిఫలంతో వాడి తల్లిదండ్రులు జీవించాలి—రాజే వాళ్ళనిపోషించాలి—చిన్నతనంనుంచి సం

పాదించే సాధనం సినీమా అనీ మీదగ్గరికి తీసుకొచ్చాను. సినీ మారంగంలో వాణ్ని పైమెట్టుపై కూచో పెట్టగల సమర్థులు మీరని... మీదగ్గరికే తీసుకొచ్చాను."

"నెలకి వాళ్ళకి వందరూపాయలు పంపుతాను — నేను జీవించి ఉన్నంతకాలం... రాజుని చూచినదగ్గర్నుంచీ ఎందుకో నాకా ఉద్దేశ్యం తీవ్రంగా కలుగుతోంది..."

"నిజమే కావొచ్చు కాని వంద రూపాయల్తో వాళ్ళు ఎల్లకాలం సంతృప్తిపడరు. కుర్రాడు పెద్దవాడైతే అలాంటి వందలు పది కూడావస్తాయికదూ..."

"కద్మా — నువ్విష్టపడితే ఎంతైనా చేయించగలవు."

"మరి నా షరతు విన్నారా?"

"ఏమిటి?"

"కుర్రాడు నన్నువిడిచి ఉండలేడు మరి నా..."

"నువ్వూ ఉండొచ్చు...నిన్ను అడ్డుపెట్టే వారెవరూ లేరు...నువ్వూ నేనూ జీవయాత్ర సాగిద్దాం..."

"రఘు అన్నమాటలేనా ఇవి?"

"ఆ — రేపుమధ్యాహ్నం మంచిరోజు కనుక్కొని చెప్తాను. నా లాడ్జిలోకి రాజుతో వద్దువుగాని..."

"మరి శివాజీ సంగతి..."

"తప్పకుండా రాజునే వేయిస్తాను."

ఆసాయంత్రం నేనూ 'రాజూ' పద్మా పిక్చర్‌కి వెళ్లాం. రాజు నా ఒళ్లో నే కూచున్నాడు ఒళ్ళు వేడిగా ఉంది. మర్నాడు రాజుకి జ్వరం వచ్చిందని పద్మ ఫోన్ చేసింది. నాఒళ్లు గగుర్పొడిచింది. ఈ వార్త వినగానే వెంటనే డాక్టరుకి రింగ్ చేసి హోటల్‌కి వెళ్ళమన్నాను.

నేనూ హోటల్‌కి వచ్చేటప్పటికి నర్సుతో సహా డాక్టర్ వచ్చాడు. రాజుని పరీక్షించాడు. "స్వల్పజ్వరం ఫరవాలేదు." అన్నాడు డాక్టర్, నా గుండె ఇప్పటికి తేలికైంది.

పద్మ "మంచిరోజు ఎప్పుడో కనుక్కున్నారా ?" అని అడిగింది.

"లేదు."
"మరెప్పుడు రింగ్ చేస్తారు ?"
"వెడ్డింగురింగ్ కొన్న వెంటనే" అన్నా నవ్వుతూ.

పద్మముఖం వికసించింది. ఇన్నాళ్లకి పద్మ తన దురుసుతనానికి విచారించి నన్ను వెతుకుతూ ఏదోవంక పెట్టుకువచ్చిన పద్మ బేలతనానికి నాకు జాలికలిగింది. మాస్నేహాన్ని ముందుగా విడదీసినవాణ్ని నేనైనా, నాకోసమే ఇన్నాళ్ళూ మిగిలిన మిత్రుల్ని వెళ్ళగొట్టి ఏకాంతంగా అక్కగారింట్లో కాలక్షేపం చేస్తూ పద్మ పశ్చాత్తాపపడింది. హృదయం ఒకరికోసం తహతహ లాడుతూన్నప్పుడు శాసనాల్ని, నిర్బంధాల్ని లెక్క

చెయ్యకుండా కోరినహృదయంకోసం వేచిఉంటుంది. పసు
గెడ్తుంది.

రాజుకి జ్వరంతగిలి వారంరోజులైంది. ఇంకా పథ్య
ముఖానికిరాలేదు. రాజు నన్నూ పిన్నినే స్మరిస్తున్నాడు ఇంతవ
రకూ. ఆవేళ అమ్మ కావాలని ఏడ్చాడు. వెంటనే వైర్ చేసాను.

టైఫాయిడ్ జ్వరమన్నాడు డాక్టర్. పదిహేను రోజులం
దాటాయి, ఇరవైఒకటోరోజున పథ్యం పెట్టవచ్చుననుకున్నాం.
నా కార్యక్రమాన్నంతా ఆపుచేసి ఇరవైనాలుగు గంటలూ
రాజుదగ్గరే గడుపుతున్నా. రాజు ఆరోగ్యంకోసం ఎన్ని దేవు
ళ్లకో మొక్కాను. హృదయపూర్వకంగా మొక్కుకునే మొ
క్కుబళ్లని మనదేముళ్లు వింటారన్నది పట్టిఅబద్ధమని ఇరవైరెండో
రోజున రాజు కన్నుమూసినతర్వాత గ్రహించాను. రత్నంలాంటి
రాజు నా చేతుల్లోంచి పరలోకానికి పోయాడన్నది నాజీవితంలో
పెద్దమచ్చ అయిపోయింది. పద్మ, అక్క విచారానికి అంతు
లేదు. పద్మఅక్కయ్య నాలుగు రోజుల్లోనే వెళ్ళిపోయింది.

శివాజీ చిత్రం రాజుకే అంకితం ఇవ్వదలచుకున్నా.
నన్నూ పద్మనూ కలిపిన రాజు నామధేయాన్ని సువర్ణాక్షరాల్తో
లిఖించదలచుకున్నా.

# విజయం

నే నింతవరకూ అవివాహితగా ఉండిపోయాను అంటే దానికి కారణం నే నమితున్న వ్యక్తి నా స్నేహితురాల్తో సంసారం చేస్తూండడమే.

అతనికి నన్ను పెళ్ళిచేసుకోవాలని లేదని నాకు తెలుసున్నా అతనిని తప్ప మరొకర్ని నేను పెళ్ళాడ దలచుకోలేను. అందుచేతే నేనిలా ఉన్నాను.

ప్రతిరోజూ నే నతని ఇంటికివెళ్ళి అతన్ని చూసేదాన్ని. అతను కనిపించనినాడు నే నెంతో బాధపడేదాన్ని. రాత్రి పది గంటలవరకూ అతని భార్య సుశీలతో కబుర్లు చెప్తూ గడిపినరోజులూ ఉన్నాయి. అతను ఆలస్యంగా ఆఫీసునుంచి రావడమే నేను రాత్రి పదిగంటలదాక గడపడానికి కారణం. నన్ను చూడ్డంతోనే అతను మొహం చిట్లించుకోవడం నేను కనిపెట్టకపోవటంలేదు. అతను వచ్చిన అయిదు నిమిషాల్లో సంభాషణలు ముగించుకుని సుశీల దగ్గర సెలవు తీసుకునేదాన్ని.

ఇంటికివచ్చి బాధపడేదాన్ని — నేనంటే అతనికి అంత అసహ్యం ఎందుకని — తరవాత ఏడ్చేదాన్ని, భగవంతుణ్ణి ప్రార్థించేదాన్ని - నన్ను అతను ప్రేమించేలా చెయ్యమని, భగవంతుడికి అలా చెయ్యగలిగే శక్తి ఉందని నాకు గట్టి నమ్మకం.

అతనికి పెళ్లికాక పూర్వం నేను పలకరిస్తే ఒకప్పుడు కాకపోతే ఒకప్పుడైనా మాట్లాడుతూండేవాడు. ఇప్పుడు ప్రబల విరోధిలా ప్రవర్తించడం నేను భరించలేకుండా ఉన్నాను.

సుశీలకి జ్వరంవచ్చిననాడు మధ్యాహ్నమే చూడ్డానికి వెళ్లాను. సుశీల నిద్రపోతోంది. అతను పక్కకుర్చీలో కూచున్నాడు. నేను రావడంచూచి పక్కన మూసివున్న పుస్తకాన్ని చప్పున తీసుకుని ఆ అక్షరాల్ని చూడ్డం మొదలెట్టేడు.

"జ్వరం తగ్గిందా?" అన్నాను. అతను జవాబివ్వలేదు. సుశి కళ్లు తెరిచి "కొంచెం తగ్గింది" అంది.

మధ్యాహ్నం ఇంట్లో అతను ఉండడుకదా అని వెళ్ళేను. ఆవేళ ఆఫీసుకి సెలవుపెట్టి ఆమెను కనిపెట్టుకు కూచున్నాడు. నాకు చాల బాధకలిగింది. చిన్న జ్వరానికే ఆమెను కని పెట్టుకు కూచోడానికి ఆఫీసుకి సెలవు పెట్టాడని —

ఆవేళ నన్ను మందు కాదుగదా మంచినీళ్లైనా సుశీలకి అందివ్వనీయలేదు.

సుశి మూడేళ్లకూతురు బేబీని దాసీమనిషి ఎత్తుకుని "ఈవేళ అమ్మగారు పథ్యం పుచ్చుకున్నారు - కాలక్షేపానికి మిమ్మల్ని రమ్మన్నారు" అని సుశీల కబురంపేదాకా నేను వాళ్ళింటికి వెళ్లలేదు. ఈ నాలుగు రోజులూ అతన్ని బజారుకి పోతూండగా మా కిటికీలోంచి చూసుకుంటూండేదాన్ని.

ఇష్టంలేని పిల్లల్ని చేసుకున్నవాళ్లు కాలం గడిచిన కొద్దీ భార్యల్తో ఇష్టంగా ఉండడానికి అవకాశమేనా ఉంది కాని నా విషయం...? అతన్ని పెళ్ళిచేసుకోలేదు సరిగదా వెళ్లయి

పోయింది అతనికి! ఇంక నాకీ వెర్రిమొర్రి ఆశలెందుకూ అంటే సమాధానం చెప్పలేను.

ఆనాడు పొద్దున్నే సుశీలగురించి చెడ్డవార్త - చాలా చెడ్డవార్త విన్నాను. నమ్మాను నేను. నిజంగా అలాగే జరిగింది. మూడేళ్ల కూతుర్ని బేబీని వదలి తన మేనమామతో దూర దేశానికి లేచిపోయింది.

ఇలా జరుగుతుందని అనుకోలే దెవ్వరూ. ఈ సంఘటనతో అతనిలో వికృతమైన మార్పు తప్పక కలుగుతుందని అనుకున్నాను. రెండురోజులు గడచిన తర్వాత వాళ్ళింటికి వెళ్ళాను దూరాన్నుంచి అతను వీధి గుమ్మంలో ఉండడం చూశాను నన్ను చూసిన వెంటనే అతను చేతులుచాపి ఆహ్వానించడానికి సందేహించడనుకుంటూ అడుగులు వేయ సాగాను

నేను పలకరించేవరకూ నన్నతను చూడనేలేదు. నన్ను చూశాక చరచన లోపలికి వెళ్ళాడు.

బేబీ నన్నుచూసి పిన్నీ అని కేకేస్తూ బైటికి వస్తోంటే అతను బేబీని రానివ్వలేదు నాదగ్గరకి - బేబీ పిన్నీ పిన్నీ అని అరుస్తూంటే ఒకసారి వదిలిపెట్టాడు.

బేబీ నన్ను కౌగలించుకుని "అమ్మ ఎప్పుడొస్తుందో చెప్పవ్ పిన్నీ" అంది.

"నేనేం చెప్పను సమాధానం?"

"రేపో, ఎల్లుండో వస్తుందమ్మా" అన్నాను.

"నువ్వు రోజూ వస్తావ్కదూ?" అని మళ్ళీ ప్రశ్నించింది బేబీ—

"తప్పక" అన్నాను.

అతను నాతో ఏమీ మాట్లాడలేదు.

*　　*　　*　　*　　*

వాళ్ళింటికి వెళ్ళి అప్పుడే వారంరోజులైంది. అతను ఆఫీసుకి పదిహేనురోజులు సెలవుపెట్టి ఇంటిదగ్గర బేబీని కనిపెట్టుకు కూచున్నాడు.

మా ఇంటి కోనాడు వాళ్ల దాసీమనిషివచ్చి ఇలా చెప్పింది. "బాబుగారు బేబీ మొగపిల్లల్తో ఆడుకోనీటం లేదు - మాట్లాడనీటంలేదు- చూడనివ్వటంలేదు. పక్కింటివాళ్ళ అమ్మాయిని మధ్యాహ్నం పిలిచి ఒక అరగంటసేపు బేబీతో ఆడుకోనివ్వనిస్తున్నారు. బేబీ అక్కడి కెళతాను ఇక్కడికెళతానని ఏడుస్తూన్నా ఖైదులో ఉంచినట్లు ఉంచి బాబు కాపలా కాస్తున్నాడు."

ఈనూతనప్రవర్తన అతనిలో కలగడానికి కారణంఏమిటో అని ఆలోచించాను. చిన్నపిల్లల్ని అంత కట్టుబాట్లో ఉంచితే చాల నష్టాలు ఉన్నాయ్. అదికాక బేబీ నీలా చేస్తూండడం నేను భరించలేకపోయాను.

రోడ్డుమీదేనా ఆపి నిలబెట్టి మాట్లాడడానికి సిద్ధపడు తున్నాను. షికారుకు వెడుతూ నేనతనికి ఎదురుగా వెళ్ళి "ఒక స్త్రీ అలా చేసిందని బేబీని స్వేచ్ఛగా ఆడుకోనీకుండా తిరగనీకుండా చెయ్యడం ప్రమాదాలకి తోవతీస్తున్నావు" అన్నాను.

కళ్లెర్ర చేస్తూ "నీ పని నువ్వు చూసుకో" అని చరచరా వెళ్ళాడు.

నాకు పనేముంది? అతని ప్రేమను సంపాదిద్దామని ప్రయత్నాల్ని ఇరవైనాలుగు గంటలూ ఆలోచిస్తూండడం తప్ప మరో పనేముంది?

నా ఆశలన్నీ ఒక రూపానికి రాగలగడానికి అవకాశం కలిగిందని ఆనందిస్తున్నా నాలోని ఒక స్వరం "సుశీల లేని కాలం వచ్చినా నిన్ను ఈసడిస్తున్నాడని" నన్ను ధైర్యపరుస్తోంది. భగవంతుణ్ణి ప్రార్థించేదాన్ని, "నా కోరిక నెరవేర్చడానికి నీకు వీలుంది సుమా" అని.

బేబీ కిటికీలోంచి ఒకపిల్లాణ్ణి చూస్తూంటే అతను కళ్లెర్ర జేస్తూ "బేబీ- నువ్వు అక్షరాలు దిద్దుకో- వాళ్ల కేసి చూడ కూడదు" అంటున్నాడు నే నతనింట్లో ప్రవేశిస్తూండగా.

పాపం, శిశుమనస్సు అతని మాటల్లోని అంతరార్థం ఏం గ్రహించగలదు? చిన్నప్పట్నుంచి అలా మాట్లాడుతూ మగ వాళ్లంటే అసహ్యాతను కలిగించాలన్న అతని ప్రయత్నం నిష్ఫలం అవుతుందనడంలో సందేహం లేదు. ఎందుకు చూడకూడదో

అని ఆ లేతమనస్సు అతను లేని కాలంలో చూడడానికి ప్రయ
త్నించి తీరుతుంది.

బేబీ నన్ను చూసి "పిన్నీ ఇంత ఆలస్యంగా వచ్చావేం
ఈ వేళ ?" అంటూ పరుగెత్తుకువచ్చి నాచేతుల్లో తలదాచు
కుంది.

"బేబీని కనిపెట్టుకుని మా ఇంట్లో ఉంటావా ?" అన్నా
డతను. నా చెవుల్ని నేను నమ్మలేక పోయాను. స్త్రీ అతనికి
ఆ పనికేనా అవసరం ? నిజంగా అందుకే !

అతను నన్ను ప్రేమిస్తాడని నాకు ఆశలేదు అయినా
ప్రయత్నించడానికి వీలుకలిగింది. సరే అని నా అంగీకారాన్ని
తెలియజేయడంతోనే అతను నన్ను తన రెండో భార్యగా స్వీక
రించాడు.

పేరుకే భార్య. ఇంట్లో నాకో ప్రత్యేక గది. నేనాగది
లో భగవంతుణ్ణిలా ప్రార్థిస్తూ చాలారోజులు గడిపేను. రోజు
గడిచినా నా కోరిక నెరవేరలేదు. "బేబీని నువ్వు చాల జాగ్ర
త్తగా కనిపెట్టుకుని ఉండాలి," అని ఆజ్ఞాపించేవా డతను.

"నాకా సమస్యకన్న తీవ్రమైంది మరొకటి బాధిస్తోంది."
అన్నాను.

"ఏమిట"న్నాడు.

"నాకు ప్రత్యేక గది ఇంకా ఎన్నాళ్లు ?" అన్నాను.

సమాధానం చెప్పకుండా కోపంగా చూస్తూ బైటికి వెళ్ళి పోయాడు.

ఆవేళ అతను కాంపుకి వెళ్ళాడు. బేబీ తనతో చదువు కుంటూన్న కృష్ణని ఇంటికి తీసుకువచ్చి నవ్వుతూ కేరింతలు కొడ్తూ తన గదిలో ఒక గంటసేపు కాలక్షేపం చేసింది. నన్ను లెక్క చెయ్యకుండా. కృష్ణ ఉండగా బేబీని కేకవేస్తే ఏమనుకుం టాడో అని ఊరుకున్నాను.

కృష్ణ అలా వెళ్ళాడు. "పిన్నీ అన్నంపెట్టు సినిమాకి వెళ్ళాలి" అంది బేబీ.

"మీ నాన్న ఊళ్లో లేడనేగా ఇంత ధైర్యం" అన్నా బేబీతో.

"అవునే పిన్నీ- ఈవేళ హాయిగా సినిమాకి వెడతాను." అంది.

"చాల ప్రమాదం సుమా- నాన్నకి తెలిస్తే చంపే స్తాడు నిన్నూ నన్నూ."

"ఎలా తెలుస్తుంది ? నువ్వే చెప్పాలి..."

"నేనెందుకు చెప్తాను..."

"ఏమో..."

"నువ్వు సినిమాకి వెళ్ళడానికి వీల్లేదు"

"నేనిలా కృష్ణతో సినిమాకి వెడుతున్నానని ఈర్ష్యగా ఉందికదూ నీకు ?" అంది బేబీ.

నేనింకా మాట్లాడలేక పోయాను. ఈర్ష్య, ఎంతటి మాట ప్రయోగించిది! నేనంటే ఏమాత్రం భయం లేకపోవ డానికి నేనిస్తున్న చనువూ, స్వాతంత్ర్యమే కదూ కారణం!

బేబీ చిన్నప్పుడు చాలా మంచిదనుకున్నాను. కాని వాళ్ళ అమ్మకన్న రెండాకులు ఎక్కువే చదువుకుంది! అత నెదురుగా భయభక్తుల్తో సంచరిస్తూ తెర వెనకాల ఘోరకృత్యా లు చేయడానికి వెనుదీయని గుణం తల్లి రక్తానికి ఉన్నప్పుడు బేబీకికూడా ఉండడంలో ఆశ్చర్యమేముంది?

బేబీకి అన్నం వడ్డిస్తూ "బేబీ! నువ్వు చాలా క్రూరంగా మాట్లాడుతున్నావ్" అన్నాను.

"నిజం పలికితే నీకు క్రూరంగా కనిపిస్తోంది"అంది బేబీ. నేను చాల బాధపడ్డా ఆ సమాధానానికి.

సినీమాకి వెళ్ళింది బేబీ. రాత్రి నిద్రపట్టటం లేదు. ఈర్ష్య నాలో ఎన్నాళ్ళనుంచి నివాసం ఏర్పర్చుకుంది? నాకు తెలీదు కాని ఆనాడుమాత్రం బేబీ కృష్ణతో చంక లెగరేసు కుంటూ సినీమాకి వెళ్ళడం తలుచుకుంటూంటే నాకు కొద్ది ఈర్ష్య కలగకపోలేదు- ఇన్నాళ్ళు జీవితాన్ని అలాంటి సన్ని వేశం ఒక్కటైనా లేకుండా గడిపి ందుకు—

రెండు రోజులు పోయాక బేబీ మెల్లిగావచ్చి "పిన్నీ- నిన్ను బాధపెట్టే మాటలన్నాను, ఏమీ అనుకోకు" అని ప్రాధేయంగా అడిగింది. "చిన్నతనం అలా అనిపిస్తుందమ్మా-

వరవా లేదుతే" అన్నాను. నా సహనశ క్తి నర్థంచేసుకుని నాకేసి జాలిగా చూసింది బేబీ.

ఊరునుంచి అతనూ వచ్చాడు. అతన్ని చూసినప్పుడల్లా బేబీ అన్నమాటలు నాలో ప్రతిధ్వనించేవి.

ప్రణయం చిన్నవాళ్లకి ఒక సాహసిక చర్యగానూ, పెద్ద వాళ్లకో పనిగానూ ఉంటుందని ఎప్పుడో చదువుకున్నట్లు జ్ఞాప కం. అతనికావనితో నిమి త్తంలేదు...ఇన్నాళ్ళు పెళ్ళిచేసుకో కుండా ఉండి ఆఖరికి అతని భార్యగానే అయిందని లోకం అం టూంటే సంతృప్తి పడుతున్నాను.

మరొక కొంతకాలం గడిచింది.

రాత్రి నాకు నిద్రపట్ట లేదు. బేబీ గది దగ్గరకివచ్చి లోప లికి చూశాను కిటికీలోంచి. ఆమె గ్లాసులో ఏదో పోస్తోంది. లైటు వెలుగుతూనే ఉంది. "బేబీ ఏమిటది" అని కేకేశాను. బిత్తరపోతూ నా కేసి చూసి మంచంమీద కూలబడింది. "తలు పుతియ్యి" అన్నాను.

లోపలికి వెళ్ళి సీసా తీసి చూసాను. "పాయిజన్" అని ఉంది. నా నరాలు జల్లు మన్నాయి. ఎవరో లాక్కొచ్చినట్లు నే వచ్చానే గాని, లేకపోతే బేబీ ఎంత సాహసం చేసేది అను కున్నా.

నన్ను చూసి బేబీ కన్నీరు కారుస్తోంది. మెల్లిగా ఆమె తలని ఒళ్లో పెట్టుకుని నిమురుతూ "బేబీ - ఇంతపని ఎందుకు చేస్తున్నావ్" అన్నా. బేరుమని ఏడుస్తూ నన్ను కౌగిలించు కుంది.

"చెప్పు బేబీ-" అన్నా.

"పిన్నీ..." అని చెప్పబోతూ ఊరుకుంది. "చెప్పు బేబీ ...నేను నీ తల్లిలాంటిదాన్ని కదూ - భయం ఎందుకు" అన్నా. "పిన్నీ..." అని మళ్ళీ ఏడ్చి ఊరుకుంది.

అయిదు నిమిషాలు ఆమెను ఓదార్చాక "నేను మాతృదేవత కాబోతున్నాను" అంది. నా నాడులన్నీ ఆ మాటల్తో పుటుక్కున తెగినట్లయింది. అయినా "బేబీ - నీకేం భయం లేదు. మళ్ళీ ఇల్లాంటిపని చెయ్యవుకదా" అని చెయ్యనని ఒట్టేయించుకున్నాను.

నన్ను భార్యగా ఉండేలాగ అతను అంగీకరించినప్పట్నుంచి భగవంతుడు నేను ప్రార్థిస్తే తప్పక వింటాడని నాకు గట్టినమ్మకం గలిగింది. ఆ రాత్రల్లా ఈ గండంనుంచి తప్పించమని ప్రార్థనలు జరిపాను.

ఆవేళ అతనికి నైట్ డ్యూటీ. తెల్లవారుజామున మా డింటికి ఇల్లు చేరుకుంటాడు. కృష్ణ తండ్రిని నే నెరుగుదును. నాక్లాస్‌మేటు. "నీతో ముఖ్యమైన సంగతి మాట్లాడాలి...కు రావాలి. రాకపోతే ప్రమాదాలు జరుగుతాయి" అని కృష్ణ తండ్రి రావుకి ఉత్తరంవ్రాసి దాసీదాని చేతికిచ్చి పంపాను.

...లో నన్ను కలుసుకున్నాడు. నేను సంగతి చెప్పాను. "ఈ తక్షణం నువ్వు బేబీని కృష్ణని ఎక్కడికైనా పంపే ఏర్పాటు చెయ్యాలి. లేకపోతే అతని సంగతి నీకు తెలియనిది కాదు. హత్యలుకి వెనుదియ్యడు" అన్నాను.

"నే నెందుకు వెనుదీస్తాను ?"

ఎవరాసమాధానం ? అతనే...... నేను నిలువునా నీరై పోయాను. అతను రావుని దగ్గరగా లాగి గట్టిగా కొట్టాడు. నే నడ్డుపడ్డాను. నన్ను నేలమట్టం చేశాడు. రావు లేచి అతన్ని చావమోదాడు. రావు బలవంతుడు. అతను స్మృతి తప్పి కింద పడ్డాడు. నేనూ రావు అతన్ని కారులో పడుకోబెట్టి డాక్టరింటికి తీసుకు వెళ్ళాం. అదృష్ట వశాత్తూ డాక్టరింట్లో నే ఉన్నాడు.

నేను క్రిష్ణకి ఫోన్ చేశాను "బేబీ దగ్గరకి తక్షణం వెళ్ళి...జాగ్రత్తగా చూడు" అని.

రెండు రోజుల్లో అతను కుదుట పడ్డాడు. బేబీ కృష్ణా బొంబాయి వెళ్ళినట్లు తెలిసి "ఎందుకు వెళ్ళారు" అని అడిగాడు నన్ను.

నేనిలా చెప్పాను. "ఓనాడు రాత్రి తాను మాతృదేవత కాబోతోందని తెలుసుకున్న తర్వాత బేబీ నాన్నకి తెలిస్తే బతకనివ్వడని భయపడి, ఆత్మహత్య చేసుకోడానికి సిద్ధపడుతూండగా అకస్మాత్తుగా నే నామె గదికి వెళ్ళాను. ఆమె నడ్డుకుని రావుతో చెప్పి నిన్ను కృష్ణను రక్షించే విధానానికి ఆలోచిస్తానని ధైర్యం చెప్పాను రావుతో ఆనంగతే మాట్లాడతూంటే"

కొంచెంసేపు అతను ఆలోచన సాగించి "నాతో చెప్తే నే నాశీర్వదించి పంపేవాణ్ణి కదూ!" అన్నాడతను.

నేను నవ్వానాతని మాటలకి. అతను వింతగా నవ్వుతూ నా చెయ్యిని పట్టుకుని దగ్గరకి లాక్కున్నాడు.

---

# పచ్చచీర.

ఎలాంటి జీవితాన్ని గడపుదామన్న విషయాన్ని గురించి ఈనాడు ఆలోచించడానికి పరిస్థితులు కూడేయి. నా అనేవాళ్లు ఎవళ్ళూ నాకులేరు. పెద్దమేడ, అందమైనభవనం ఆడుకోనేకి. నా మనవడుకూడా తనజీవితాన్ని కాలుమీద కాలేసుకుని కూచుని గడపొచ్చు. అయినా నాకలా సంచలనం లేకుండా కాలాన్ని గడపటం అంత మనస్కరించటంలేదు. నాకున్న పెద్దవిచారం ఒక్కటే ఉంది నాతోనేపుట్టి ఇరవైసంవత్సరాలూ ఒక్కక్షణం ఎడబాటులేకుండా గడిపిన నాతమ్ముడునన్ను విడిచివెళ్ళాడు. వాడు అస్తమించిన రెండేళ్లనుంచీ నాలో ఏదోబాధ వేపుకు తింటోనే ఉంది.

ఈక్షణంలో నాకుకట్టిన ఆలోచన ఒకటి ఇరవై రెండేళ్ళువచ్చిన నాతో నాబల్లపక్కనేకూచుని కాఫీ ఆరగించివెళ్తూన్న అమ్మాయిలు ఎవళ్లూ నాతోమాట్లాడరేం? పరిచయంలేని అమ్మాయిల్ని ఎలాపలకరించను? నేనా అమ్మాయిల్తో మాట్లాడాలని ఉబలాడపడుతున్నాను. అన్నీఉండి అమ్మాయిలేకపోవడమే కొరతగాకనిపించింది. ఈ ఆలోచన అరగంట నడిచింది.

ఆపచ్చచీర కట్టుకున్నయువతి అంతసేపు నా ఎదురుగా ఉన్నబల్లమీద కూచున్నా నాకేసి ఒకే ఒక్కసారిచూసింది. మళ్ళీ తలెత్తటంలేదామె కాని ఆమెతో ఉన్న మరొకయువతి,

ఒక పెద్దముత్తైదువ నాకేసి పదేపదేచూస్తున్నారు. వాళ్ల చూపులు నాకసహ్యంగా ఉన్నాయి. ఆ అమ్మాయి నాకేసిచూడాలని కోరుకుంటూన్న నాకు ఈ అవసరంలేని చూపులు నన్నెంత మధనపడుతున్నారో లెఖలేదు.

ఆ అమ్మాయి అందాన్ని వర్ణించుకుంటే సంతృప్తికలిగేట్టులేదు. ఆమె నాకేసి చూడకుండా ఉండడమే నన్ను అదేపనిగా నాకళ్లు ఆమెకేసి పోగొడుతున్నాయి. నాకూ ఆ అమ్మాయికీ మాటలుకలిపే ఏమానవుడేనా కనిపిస్తే వాడికి జీవితపర్యంతం నెలకి వందరూపాయిలివ్వడానికి నామనస్సు పూనుకుంది. కాని ఆపొరుగూరిలో ఆకాఫీహొటల్లో నన్నెరుగున్న వాళ్లెవరుంటారు ? చాలా బాధపడ్డాను. ఏమిత్రుడైనా నాతో తీసుకు వచ్చానుకాదని...

ఆమె లేచేవరకూ నేనాబల్లనే అంటిపెట్టుకు కూచున్నాను. ఈ అయస్కాంతలక్షణం నేను కూచున్న బల్లకి ఉందో ఆమె కూచున్నబల్లకుందో తెలీటంలేదు కాని ఆమె లేచీలేవడంతోనే నాబల్లనాకు దూరమైంది.

ఆపచ్చచీర ఆమెకెంత అందాన్ని తెచ్చిపెట్టింది ? ఇంత అందం స్త్రీలలో ఉంటుందని ఇంతవరకూ అనుకోలేదు. అందంగా ఉన్నా లేకపోయినా యువతులు ఎప్పుడో ఒకప్పుడు ఒక ఇంటివాళ్లవకుండా ఉండటంలేదన్న సంగతినిబట్టి అందానికి అంత ప్రాధాన్యత ఉందని నేననుకోలేదు.

ఆమె నిజంగా అందెకత్తె. ఆమెతో ప్రేమమయజీవితాన్ని సుఖంగా చుట్టవేసుకుని ప్రొద్దులుపుచ్చుదామన్న నిశ్చయానికి వచ్చాను. కాని ముక్కూమొహం ఎరగని ఆమెను నాజీవిత లక్ష్మిగా స్వీకరించడం ఎలాగన్న తీవ్రసమస్యకి సమాధానం ఏమీకనబడక నిస్పృహతో ఆమెకేసి చూస్తూనే నాగదిలోకి వెళ్ళి కూచున్నాను.

అద్దంలో నాబింబం కనిపిస్తోంది. నేనూ నిజంగా అందమైనవాణ్ణని అద్దం అంటోంది. నీకూ ఆమెకీ మంచిజతని అద్దం శిఫార్సుచేసింది. అంత అందమైన విశాలభవనంలో ఆమె ఆపచ్చ చీరతో చెంగుచెంగున గెంతుతూ నీఒడిలోపడి నీబాహువుల్లో ఇరుక్కుని కులుకుతూంటే నీభవనం అంతా కిలకిలమంటుందని అంది అద్దం.

అద్దం ఇంత ఆశ కల్పించిందెందుకో ? నన్ను బాధపెట్టి సంతోషించడం అద్దానికి ఇష్టమా ? అద్దాలప్రకృతి అంత కాబోలు !

కూచోమంది అద్దం. కూచున్నాను.

ఎదురుగా అద్దంలో ఆ అమ్మాయి కనిపించింది! వెనక్కి తిరిగిచూసాను. ఆమెయే ! ఆపచ్చచీర అమ్మాయే ! అద్దానికి చేతులు లేవు కాని ఉన్నట్టయితే హృదయపూర్వకం షేక్‌హేండ్ ఇచ్చి నాగట్లుదాటిన ఆనందంతో చేతులుకూడా నలిపేసి ఉండే వాణ్ణి.

ఆమె నాకో చీటీ ఇచ్చి వెళ్ళిపోయింది !

ఇంతవరకూ అమ్మాయిల్తో మాట్లాడాలని ఉబలాటప డ్డం అయిందే కాని తీరా ఆమెవస్తే నాపెదివిలు స్పందించనే లేదు. పట్టి ఊహల్తోనే నోరుచప్పరించుకుంటూ కాలంగడిపే యువకు లమాట తలపుకొచ్చి గట్టిగా నవ్వుకున్నా. ఈసంగతి తెలిస్తే నన్నూ ఆయువకుల్లో జమకడ్తారని అనుకుని.

ఎంత మతిలేనివాణ్ణి నేను !

ఆమె చేతిగోరు చివర్లైనా నాకు తగలలేదు. ఆ భాగ్యా నికి నేను నోచుకోలేను కాబోలు. ఈచీటి నాపిచ్చిచూపులకే నైనా శిక్షవిధించబోతోందా ? భయపడ్డాను. ఆపెద్దముత్తైదు వకి కోపంవచ్చి ఈశిక్ష విధించలేదుకదా !

చీటి విప్పిచూసాను వెర్రికళ్ళతో

"నాయంటే దయయుంచి ఒక్కసారి మీరు మేమంతా కూచున్న బల్లదగ్గరికొచ్చి నాతో లక్ష్మీ నన్ను ఇంకా క్షమించ దలచుకోలేదా" అని దీనంగా ప్రశ్నించండి. కొంచెంసేపాగి "నీమనస్సుతిప్పాలన్నట్లయితే నామకాం నీకు తెలుసుకదూ. వెం టనే అక్కడికిరా" అనండి. ఈమాటలుతప్ప మరొక్క అక్షర మైనా అనకండి.

ఈచీటి అంతరార్థంఏమిటో అగమ్యగోచరంగా ఉంది. ఒక్కసారిమాత్రమే నాకేసిచూసి చూపు లాపేసినయువతి స్వ యంగా నాదగ్గరికొచ్చి నా కీస్వహస్తాక్షరాల పత్రా న్నందిచ్చి

వెళ్ళిందంటే నా ఆశ్చర్యానికి మేరలేదనడంలో సందేహం ఏముంది ? ఎంతగాఢంగానో ఆలోచించాను. చీటి అర్థం అవగాహన కాలేదు. ఇంత అపరచితవ్యక్తితో ఇంతదీనంగా మాట్లాడం నామోషీగా కనిపించింది. మామాటలు క్షమాపణవాక్యాల్తో ప్రారంభమౌతున్నాయన్న విషయమే నన్ను కొంచెం అసహ్యపరుస్తున్నాయి. కాని నామనోభావాన్ని చదివి వచ్చినట్టుగా నా ఒళ్లోనే వండుపడినప్పుడు ఈసదవకాశాన్ని పోగొట్టుకుంటే ఆమె నాజీవితాలు సుఖంగా గడుస్తాయా అన్నదే సందేహంగా ఉంది. చీటి భావగర్భితమైంది.

తూచా తప్పకుండా చీటీసూచనలప్రకారం పాఠం వప్పగించి ఇవతలకి వచ్చాను కాని నామనఃలోనిభావం దీనత్వాన్ని సూచించిందా లేదా అని అనుమానం కలిగింది. ఈ అనుమానానికి ఒకటేకారణం ఆమెకి అంతదగ్గరగా పోయాక ఆకళ్ళకళకళల్లో ఆవక్షోజం మిలమిలల్లో నాచీటీ సూచనలు ఇగిరిపోయాయి.

మళ్ళీ గదిలో అద్దంముందు నించున్నా. నాకన్నముందు నా అద్దమే సంతోషించింది.

రాత్రి చల్లటివెన్నెల్లో పడుకున్నాను అప్పుడే గడియారం తొమ్మిదికొట్టింది. మలయమారుతంవల్ల శబ్దిస్తున్న ఆకుల గలగలల్లో ఆమెగాజుల గలగల లీనమైపోయాయి. ఆమె ఆగమనం నేను గమనించనేలేదు. ఆసన్నటి లేతవేళ్లు నాజుట్టులో

చొరబడ్డాయి. లేచి వెనక్కి చూశాను. ఆపచ్చచీర కట్టుకున్న అమ్మాయే !

"కూచోండి" అన్నాను.

మంచంమీద కొంచెం దూరంగా కూచుంది. నే నామె దగ్గరగా జరగడానికి ధైర్యం లేకపోయింది.

"మీకు శ్రమ ఇచ్చినందుకు మన్నించండి నిరాకరించకుండా నామాట కొనసాగించినందుకు కృతజ్ఞత" అందామె.

ఆఁ దానికేముంది ఏమీ శ్రమ లేదు.

"రేపు మా ఊరు వెడుతున్నాను. మా అడ్రసు ఇదిగో, మీరు తప్పకుండా ఓవారంరోజుల్లో రండి"

"తప్పకుండావస్తాను"

"సరే సెలవు" అంది.

ఒక్క సెకనులో ఆమె వెళ్ళిపోయింది.

ఎంత నిర్దాక్షిణ్యం !

చక్కటిచల్లటి వెన్నెల్లో నన్నొక్కణ్ణి చేసివెళ్ళిపోయింది.

ఇంకా ఎనిమిదిగంటలు బరువెక్కిన హృదయంతో బాధపడమని వెళ్ళింది ! చాలా బాధపడ్డాను. ఒక్కనిమిషమైనా ఆమెను నాబాహువుల్లో దాచిపెట్టుకో లేకపోయాను! చంద్రుడు నా అపజయాన్ని చూసి వెక్కిరిస్తున్నాడు.

ఆనాడు ఇల్లు వెతుక్కునేసరికి తాతలు దిగొచ్చారు. నాస్థితికితగ్గ సంబంధంకాదని ఆ ఇల్లు చూడగానే అనుకున్నాను.

కాని గృహంలో అడుగుపెట్టగానే పచ్చచీరతో వెన్నెల్లానవ్వు తూ ఆమె నాకెదురు అవగానే ఆ ఇంటికి ఎంతవెలుగు వచ్చిం దో లెఖలేదు. నా ఇల్లు అంత వెలుగ్గా ఇప్పటివరకూ కనిపించ లేదు.

ఎంతో మర్యాదగా "కూచోండి" అంది.

నారాకగ్రహించి పెద్దముత్తైదువ, మరొకయువతి ముసి ముసినవ్వుల్తో నన్ను సమీపించారు. పూర్వాలు నడిచేపద్ధతు లోనే పెళ్ళిమాటలు మాట్లాడారు. వివాహనిశ్చయాల్లో ఇంకా నవనాగరిక పద్ధతులు పూర్తిగా ప్రవేశించలేదు.

సాయంత్రం ఆమెను అడిగాను. చీటి ఆంతరార్థం చెప్ప మని.

"నేనూ, మాపిన్ని, మాచెల్లెలూ ట్రెయిన్‌లో వెడు తూంటే మావక్కనకూచున్నావిడ తనస్టేషన్‌లో దిగిపోతూ ఈబొమ్మ కిందపడేసి మరచిపోయింది. చూడండి" అని ఓ ఫోటో బొమ్మనందిచ్చింది.

ఫోటోచూచి "తర్వాత..." అన్నాను.

"ఈ ఫోటోచూసిన దగ్గర్నుంచి మిమ్మల్ని పెళ్ళిచేసు కోవాలని బుద్ధిపుట్టింది. నేను అస్తమానూ ఫోటోచూస్తూంటే మాచెల్లి, దానిస్నేహితురాళ్లు వెకవెకనవ్వేవారు. వాళ్లునవ్వు తున్నకొద్దీ నామనస్సు మీకు దగ్గరగావచ్చింది. ఎంతోబాధప డేదాన్ని. మీరు ఆడవాళ్లై పుడితే ఆబాధ ఎలా ఉంటుందో గ్రహించగలిగేవారు" అంది.

నేను నాదేవుళ్ళందరికీ నన్ను ఆడదానిగా పుట్టించకుండా ఉన్నందుకు సహస్ర కృతజ్ఞతాపూర్వక అభివాదాలు మనస్సులో అర్పించాను.

లక్ష్మి మళ్ళీ ప్రారంభించింది "ఓనాడు నాచెల్లి మాపిన్ని ఎవరి ఈఫోటో అని అడిగారు. నాతో మొన్నటివరకూ చదువుకున్న స్నేహితుడని చెప్పాను. ఎప్పుడూ మన ఇంటికి రాలేదేం అని మళ్ళీ అడిగారు. స్కూల్లో ఉన్నప్పుడే మేం దెబ్బలాడుకోడంచేత రావటంలేదన్నాను."

ఇప్పుడు గ్రహించాను. ఆనాడు నాకేసి లక్ష్మి ప్రసరించిన చూపులకన్న వీళ్ళిద్దరిచూపులూ మించిపోడానికి కారణం.

ఆచీటీ సూచనలో నన్నింకా క్షమించదలచుకోలేదా అన్నదానికి పూర్వవృత్తాంతంకూడా తెలిసింది.

"తరవాత ఏమయింది ?" అన్నాను.

"రెండేళ్లు కళ్లుచిల్లులుపడేలా ఈ ఫోటోవ్యక్తికోసం చూసాను. చుట్టపక్కలున్న ఊళ్లల్లో ఏమిలాభం లేకపోయింది. నిస్పృహపొందాను. పేచీకోరు మొహాల్ని తిరిగిచూస్తారేమిటి అని మాపిన్ని సాధించింది చాలాసార్లు. నాగుండె నీరయింది. కాని అకస్మాత్తుగా ట్రెయిన్‌లో ఫోటోమరచిపోయినామె సంభాషణబట్టి ఈవ్యక్తి ఈ ఊర్లో ఉంటాడుకదా అని అనుకున్నా. దానికితగ్గట్టుగానే మాపిన్నికికూడా ఆ ఊరివని కలిగింది అంతటి మహాపట్నంలో మీరు కనిపిస్తారాఅని నిరాశ చేసుకున్నా కాని నా అదృష్టవశాత్తూ కనిపించారు"

"తర్వాతేమయింది ?" అన్నా నవ్వుతూ.

"పెళ్ళి" ఒక్కక్షణం నే నామెను నాలోలా కూ నేవర కూ నా ఆనందం తగ్గలేదు. నిజానికి ఆమెకుదొరికిన ఫొటో నాతమ్ముడు లక్ష్మణుడిది. నేనూ వాడూ కవలపిల్లలం. ఫొటో ల్లో అందులోనూ చిన్నతనంలో మా ఇద్దరిలో నన్ను మాతమ్ము ణ్ణి సరిగ్గా కనుక్కోలేకపోయేవారు.

నాకు ఓతమ్ముడు ఉండేవాడని లక్ష్మితో చెప్పానుకాని ఈఫొటో వాడిదని చెప్పలేదు. లక్ష్మి నాబాహువుల్లో ప్రతిక్ష ణం ఇరుక్కుపోతూంటే ఫొటోసంగతి మర్చిపోతున్నానంటే ఆశ్చర్యం ఏముంది ?

---

# సలహా.

చెల్లీ,

నీకో అక్కయ్య ఉందనీ, నాకో చెల్లెలు ఉందనీ మొ న్నటి ఉత్తరంవల్ల అర్థం అయింది. ఇదంతా అమ్మ చెప్పివుం టుంది. తల్లిప్రేమ అలాంటిదే ఏంచేస్తాం ? ఏకగర్భాన జన్మిం చాం-కాని ఒకళ్ళమొగం ఒకళ్ళం-ఎరగం. నుదుటవ్రాసినవ్రాత ఏంచెయ్యగలం ? అనుభవించడమే.

చెల్లెలి చిన్ననాటి చిలిపి చేష్టల్నిచూసి ఆనందించే భా గ్యం నాకులేదు. నీముద్దుమాటలు విని మురిసే యోగ్యత నాకు

లేదు. నీయౌవనశరీరాన్ని అవలోకించి సంతృప్తిపొందే భాగ్యం లేదు. ఇద్దరం కలిసిమెలసి తిరిగేటందుకు నోమునోచుకోలేదు. అంత దురదృష్టవంతురాల్ని నేను.

నాసంగతి పూర్తిగా నీకు అమ్మ చెప్పివుండదు. అయినా ఆమె మాటల్నిబట్టైయినా నీవు గ్రహించి ఉంటావనితలుస్తాను. నాచరిత్ర నీలేతహృదయంలోకి ప్రవేశపెడదామని ఉంది. కాని దానిపర్యవసానం నీలో ఎలాపరిణమిస్తుందో అనేభయం ఓటి వేస్తోంది. అయినా నాగాథలోని అంశాలకి విరుగుడు కూడా చెప్తాను. నీభావిజీవితపథం కంటకావృతం కాకుండా చెయ్యడమే నా ఉద్దేశ్యం.

ఎంతటి ఉన్నత వంశంలో పుడితేనేం. ఎంతటి ఉత్కృష్ట ఆశయాల్తో జీవితాన్ని గడపుదామని నిశ్చయించుకుంటేనేం. విధి బలవత్తరమైనప్పుడు మానవశక్తి నిష్ప్రయోజనం. మనం ఒకలా తలుస్తే దేవుడోలా చేస్తాడు. నువ్విప్పుడు థర్డ్ఫారం చదువుతున్నావని వ్రాశావు-చాలా సంతోషం. కాలాన్నెప్పుడూ చదువుతోనే వెళ్ళబుచ్చు నీది చిన్నవయస్సు. నీమనస్సు లేడిపరుగులాంటిది. నీ మనస్సునీస్వాధీనంలో ఉంచుకుంటూంటే నాలాటి అనుభూతి జరగకుండా ఉంటుంది.

నేను ఇంటర్మీడియేట్ పేసయ్యాను. బి. ఏ. లో ప్రవేశపెడదామని నాన్నగారెంతో ఆతుర్దాపడ్డారు. నాకాయోగం లేదు. వేసవి శెలవుల్లో నేను హద్దుమీరి ప్రవర్తించాను. ఆ

రెండు నెలలూ ముక్కుమూసుకుని ఇంట్లో కూచుని ఉంటే ఈ పాటికి నాన్నగారిని సంతోషపెట్టినదాన్నయీ ఉందుకూ, పట్టభద్రురాల్నయీ ఉందును. ఇంతకీ నాకా రాత లేదు.

నాన్నగారు ఆంగ్లవిద్యనభ్యసింప జేస్తున్నందుకు సరియైన ఫలితాన్ని చూపలేక పోయాను. ఆడాళ్ళకీ ఆంగ్లవిద్య చెప్పిస్తే ఎంతో అనర్థకం అని లోకానికి వెల్లడి జేశాను. వ్యక్తి అదృష్టాన్నిబట్టి మనస్సు పరిణామం చెందుతూంటుంది. స్కూలు ఫైనల్లోకి వచ్చాను. అప్పటికి నేను పెద్దదాన్నయాను. చదువులో ఎంతో దీక్షవహించాను. ఒకరి జోలీకొంటీ అక్కర్లేనట్లు నడచాను. అయినా నామనస్సుని ఈత్రోవలోకి తొక్కించడానికి ప్రయత్నాలు జరిగాయి దానికి వశ్యం అయిపోయాను. అమమతతో నాకళ్ళు చీకట్లు కమ్మాయి, నన్ను నేనే అర్థం చేసుకోలేక పోయాను.

రఘు నాతో చిన్నప్పట్నుంచి చదువుతున్నాడు. ఒకటే డివిజను ఒకటేక్లాసు, మాకెప్పుడూ సంభాషణ జరగలేదు. అతనుమాత్రం నాతో మాట్లాడదామనే భావం అతని ముఖంలో వెల్లడిజేసేవాడు నేనవకాశాల్నిచ్చే దాన్నికాను. ఇంతకీ రఘు గొప్ప తెలివి తేటలుగలవాడా అంటే కాదు. నామార్కులు కన్నా తక్కువొచ్చేవి.

ఎటొచ్చీ అతను క్లాసుకంతకీ అందంగా ఉంటాడు. నాతోటి విద్యార్థినులు అతను అందంగా ఉంటాడని సంభాషించు

కోవడం విని నాతో మాట్లాడ నాననే ఉద్దేశ్యం అతని కుందని గ్రహించినప్పట్నుంచి నాకదోవిధమైన అసూయ కలిగింది. మిగతా నాతోటి పిల్లల్నికూడా ఆకర్షిస్తున్నాడని.

రఘు రోజుకో సూటు వేశేవాడు. డ్రస్‌మార్చినప్పు డల్లా అతను మా వెయిటింగ్ రూమ్ చుట్టూ ఇటూఅటూ తిరుగు తూండేవాడు. విద్యార్థులెప్పుడూ ఇంతే. కొత్తసూట్ వేస్తే గాని లేకపోతే వాళ్ళల్లో ఏదో వింతమార్పు కలిగినప్పుడు వాళ్ళహృదయాలు తడబడతాయి మనకళ్ళబడే వరకు, మనం చూస్తే చాలు సంతృప్తులౌతారు. చిరునవ్వునవ్వితే మనం వా ళ్ళహృదయం అంచులు దాటి ఉప్పొంగుతుంది. అలా ఉంటా యి విద్యార్థుల ప్రవృత్తులు. ఈ Instinct ప్రతి Student కి ఉంటుంది. ఈమరలవాటు వాళ్ళకి కాలేజీ నాలుగు గోడల్లోను అడుగెట్టడంతోటే అభ్యాసం అవుతుంది. ఇలాంటివి నువ్వు అప్పుడప్పుడు చూస్తూనే ఉంటావనుకుంటాను. మన ఎదుట వాళ్ళు కావలివాళ్ళల్లా తిరుగుతారు మనం మాత్రం తూరీగల్లా చీరలు విసురుకుంటూ వాళ్ళదగ్గర నడవకూడదు. నువ్వు నీచ దువు-కాలేజీలోను-యింట్లో నీచదువు-అలాగే కాలం గడు పుకో.

*　　　*　　　*　　　*

రఘు ఆనాడు బీచ్‌కివచ్చాడు. నేనూ రోజూలాగే వె ళ్ళాను. బీచ్ మనయింటికి దగర గనుక రోజూ వెళ్తూంటడం దిన

కృత్యాల్లో ఒకటయింది నాకు. మామూలుగా ఆరింటికి న్యూస్ విన్నాను. వినడంతోనే ఇంటికిరావడం అలవాటు ఆవేళ. యిం టికి రాబుద్ధేసింది కాదు. రఘుని చూస్తూ స్తంభీభూతురాల్న యాను. వానరాల్లో కొత్తరకం రక్తం ప్రవహించింది. ఒళ్ళు ఝల్లుమంటోంది. మనస్సు ముందుకు తోస్తోంది.

ఈపరిణామానికి కారణం నాదికాదని ఘంటాపథంగా చెప్తాను. ఎవరదంటావేమో, మన తలిదండ్రులిది. అంటే వా ళ్ళకి కోపం వస్తుందేమో కొంపదీసి- వస్తేఏం? వాళ్ళు చేస్తూ న్న పొరపాట్లని చిన్నవాళ్ళం అయినా మనం వాళ్ళకి గుణపా ఠం చెప్పాలి - యుక్తవయస్సు వచ్చింది. పెద్దమనిషి నయాను. యౌవనోద్రేకం దినదినం వృద్ధవుతోంది. ఎంతకాలం అరికట్టు కోవడం? స్కూలుఫైనల్ అయిన తరువాత నాకు పెళ్ళిచేస్తా నని అన్నారు. కాని ప్రయత్నాలు లేవు- బి ఏ. అయితేగాని వివాహం చేయడం ఉద్దేశ్యంలో లేనట్టు కనపడింది. చెల్లీ - నీ కింకా అనుభవం లేదుకాని- ఆఉద్రేకం వచ్చినప్పుడు మనస్సు పరిపరివిధాల పరుగెత్తుతుంది నరాలబాధ అపరిమితం అయింది. స్త్రీని కాబట్టి కొంతకాలం మనస్సుకు కళ్ళెం పట్టి ఆపుకున్నా ను. ఇంక దుస్సాధ్యం అయింది. ఆడదాన్నయితే మాత్రం ఇచ్చ ఎక్కడచస్తుంది? అనుభవిద్దామని సుఖిద్దామని ఈ జన్మకీ ఉం టుంది. అయితే ఏం? ఆలస్యం చెయ్యకుండా సకాలంలో తలి దండ్రులు మనల్ని ఒక యింటివార్ని చేస్తే మనస్సు ఇలాంటి

పరవళ్ళు తొక్కదు. లేకపోతే హద్దుమీరి ఎంత ఘోరకృత్యా ల్ని చెయ్యడానికైనా సాహసిస్తాం. అందుకని నువ్విప్పట్నుంచి నీ పెళ్ళిమాట ఆలోచించమను నాన్నగార్ని. అప్పుడే ఎందు కంటారంటే ఈ నా ఉత్తరం క్షమించు. నావల్లవచ్చిన అప ఖ్యాతిని నీవల్లైయినా కొంచెం పోగొట్టుకో గలుగుతారు.

* * *

చీకటిపడింది. బీచ్ దగ్గర లైట్లు వెలిగాయి. ఎంతో బా గుందా దృశ్యం. నాలోని వేడిరక్తం నా ఆలోచనాశక్తిని అన్య థా పనిచేయించింది. నా మెదడు గిర్రున తిరుగుతోంది. నాదే హం తొందరపడుతోంది అయిదు నిమిషాలయాక నేను రఘు పక్కనున్నట్టు తెలిసింది. రఘు మాట్లాడడం లేదు నేనే పలక రిద్దామని ఊరుకున్నాను. మనస్సు కుదుటబడేలోగా రఘూ "ఏం కమలా! ఈవేళిలా వచ్చావ్?" అని ప్రశ్నించాడు. నాకళ్ళు అతనికేసి చూశాయి. అతనికళ్ళు నాలో కలిసాయి. అనుభూను భూతి నావేడి రక్తాన్ని చల్లార్పింది.

ఆరాత్రి నాకు నిద్రపట్టలేదు. నాయీ సాయంత్రం చర్య నాకే అసహ్యం వేసుకొచ్చింది నామనో దౌర్బల్యాన్ని నేనే నిందించుకున్నాను. నాదేహంలోని పరిణామాన్ని చూసి ఎంతో భయపడ్డాను. ఒళ్ళంతా చూసుకున్నాను. నలిగిన చీర చూసి నాకంట వేడి బొప్పబిందువులు రాలేయి. ఆరాత్రి నే పడిన బాధ తలచుకుంటే ఏడ్పువసోంది. ఎంతపశ్చాత్తాప పడ్డా

షు. నా శరీరత్త హృదయవేదన నే భరించలేక పోయాను. ఆ రాత్రల్లా పగటిచర్యను మాటిమాటికి జ్ఞప్తికి తెచ్చుకుని విచారించాను. నా కన్నీటిధారలకి తలగడ నా జాకెట్టుచెయ్యి తడిసిపోయాయి. పొద్దున్నకి నామొహం కందిపోయింది. అమ్మ నాన్నా ఏం అని అడుగుతారని ఎవళ్ళకళ్ళకి కనబడకుండా మొహం కడుక్కుని టాయిలెట్ అయాను. మామూలు కమల్నయాను. టాయిలెటింగ్ తోటి నాపూర్వపు బుద్ధి ఆలోచనలూ కూడా ప్రవేశించాయి. ఎంత నిగ్రహశక్తి ఉంటే ఏం లాభం?

ఆవేళ మామూలుగానే స్కూలు కెళ్ళాను. వెయిటింగ్ రూములో కూచున్నాం. ఖర్మవశాత్తూ మాకు ఫస్ట్అవర్ లీజర్ వచ్చింది నేను ఇంగ్లీషు నాన్‌డిటెయిల్డ్ చదువుతూ కూచున్నాను. ఎవరో నడచి వస్తూన్నట్టు జాడయింది. పుస్తకంమీంచి నాదృష్టిని వీధిలోకి తిప్పాను. కొత్తరకం సూటుతో రఘు చిరునవ్వుతో ప్రత్యక్షం. చటాలున బుర్రవంచుకుని చదువుతో కూచున్నాను. రఘు మొహం చిన్నపోయింది.

రెండుమూడు సార్లు ప్రదక్షిణాలు చేశాడు. ఆనడక ఆ బూటుచప్పుడూ నాకానవాలవడం మూలాన్ని నేను దించిన బుర్రనెత్తలేదు. రఘు చాలా విచారించాడు. క్రిందటి రోజు సాయంత్రం నాప్రవర్తనకి ఇప్పటి నా నడవడికకి చాల వ్యత్యాసం ఉందని గ్రహించి అలాపరిణామం చెందడానికి కారణం ఏమిటో అని దీర్ఘంగా రఘు ఆలోచిస్తున్నాడు క్లాస్‌రూమ్

గుమ్మంపట్టుకుని. ఇంత కొద్దికాలంలోనే అతనంటే వైముఖ్యత చూపినందుకు ఆశ్చర్యపడడూ?

అతనాలోచించడం చూసి నాకు నవ్వొచ్చింది రఘు నా కేసి కళ్ళని తిప్పిచూస్తూ నించున్నాడు. ఒకసారి బుర్రఎత్తి చూశాను, గబుక్కుని కోటూ సర్దుకుని నిటాక్కూనించుని చిరునవ్వు నవ్వాడు. నేను నవ్వాను. "ఆమ్మయ్య" అనుకున్నాడు. రఘు అంతా వేళాకోళంలా మార్చేశాను. దగ్గరకొచ్చి పలకరించాడు. ఏవో క్లాస్ గొడవలు మాట్లాడేం? కాలేజీలో ఇంకేం విషయాలు మాట్లాడతాం? అసలు మట్లాడాలి-మాట్లాడకుంటేనేగాని మనస్సులు సంతృప్తిపొందవు- మాయిరువురం అంతరంగికంగా ఉన్న ఊహాల్ని పైకి అప్పుడు వెళ్ళబుచ్చక పోయినా వెళ్ళబుచ్చినట్టే. రఘు నేనూ కాస్సేపు మాట్లాడుకున్నాం. బెల్ కొట్టారు. "సాయంత్రం కలుసుకుందాం" అన్నాడు. "సరే!" అన్నాను.

సాయంత్రం అయింది. బీచ్ దగ్గర హాజరయాం. చీకటి పడేవరకూ ఫెన్సింగ్ లోనే కూర్చున్నాను. రఘు నాదృష్టిలో పలుండేలాగున కొంచెందూరంలో ఇసకలో కూలబడ్డాడు. రేడియో బంయిమని పాడుతోంది. మధ్యమధ్య ఆర్చెస్ట్రా అద్భుతంగా వాయిస్తున్నారు నాకది గందరగోళంలా కనిపించింది. శబ్దం ఎక్కువయినకొద్దీ నామనో వేదన అధికం అవుతోంది. అయిదునిమిషాలకోసారి నేనూ రఘు కళ్ళతో మాట్లాడుకుంటున్నాం.

ఎలాగైతేనేం సూర్యుడు మా ఆవేదన చూడలేక విసిగి వేసారి పడమటి సముద్రపు అంచుల్ని కౌగలించుకున్నాడు. లైట్లు కాంతివంతం అయాయి పక్కనున్న బచర్‌లో మేం యిద్దరం కూచున్నాం ఆ వేళ రఘు హృదయం ఎంతో ఆందోళన ఆతురత ఆనందం అనుభవించింది. అతనిలో నూతనత్వం కనిపించింది. అతని ధోరణిలో విశిష్టత అగుపడింది. ఆభావావేశం చూస్తూన్నకొద్దీ నామనస్సు సంతోషిస్తోంది. నాచెవికి కొత్త మాటల్ని మాట్లాడేడు ఏవేవో కొత్త ఆశయాలు. నూతనభావాల్ని విశదీకరించాడు. అవే నన్ను ఆకర్షించాయి, అతనిమాట వేదాక్షరం అయింది. అప్పటి రఘు పరిస్థితినిబట్టి ఆలోచిస్తే "నువ్వులేనిదే నేజీవించలే"నన్నాడు. ఈ అనురాగ హృదయాలకి ఎడబాటన్నది ఉండకూడదన్నాడు. నిన్ను గాఢంగా ప్రేమించానన్నాడు. నాప్రణయ సామ్రాజ్యంలో నీకు సింహాసనం వేసి కూచోబెడతానన్నాడు. మనం ఈబానిస శృంఖలాల్ని తెంపుకుని దూరంగాపోయి సుఖంగా జీవితం గడుపుదాం అన్నాడు. ఆమాటలో అనుభవం తక్కువని ఇప్పుడు గ్రహించాను. అప్పటికి ప్రపంచానుభవం నాకూలేదు అతనికీ లేదు. ఇద్దరం చిన్న వయస్కులం అయినా మాహృదయాలు తొక్కిన పంథాలోని కంటకాల్ని గ్రహించలేకపోయాం. అందులోనూ సలహాలడగడానికి యిది రహస్యవిషయం. ఎవర్ని అప్పుడు సలహాఅడిగినా మమ్మల్ని అవమానిస్తారు. అలాంటి సమయాలో సలహాలు కూడా అడగబుద్ధేస్తుందీ ? ఎప్పటికీ ఆ అభిప్రాయం ఉండదు.

చెల్లీ, నీకుముఖ్యమైన విషయాన్ని గురించి విస్తృతంగా చెప్పదలచాను- ఆవిషయం యేమిటంటే "ప్రేమ." బీచ్ దగ్గర నాచేతులు పట్టుకుని "కమలా! నిన్ను ప్రేమించాను" అని అన్నాడన్నానే, అది ప్రేమ కాదు. ప్రేమ అన్నమాటకి సరియైనఅర్థం విద్యార్థులకి తెలీదు. కాని స్టేజిమీదమాత్రం వాళ్ళప్రేమ పవిత్రమైంది- స్వచ్ఛమైనప్రేమకి చంచలం లేదనీ ఏవేవో ప్రేమ అంటే అర్థమయినట్లు మాట్లాడతారు. నిజానికి కాలేజీలోని నూటికి తొంభై తొమ్మిది విద్యార్థులకేనా ప్రేమ అన్నదానికి అర్థం తెలీదంటేనమ్ము. వాంఛాపరితృప్తికై ఆడవాళ్ళదగ్గర వెళ్ళుచ్చుడానికి ఉపయోగపడేపదం ప్రేమ- అలాఅయింది విద్యార్థులపట్ల. కామసంతృప్తికోసం వాళ్లెన్నిసాహసాల్ని చెయ్యడానికి వెనుదీయరు.

ఇంకా రఘు అంతటితో ఊరుకోలేదు. "నిన్ను పెళ్ళి చేసుకుంటాను" అన్నాడు. అంతకన్న విపరీతమైంది ఇంక లేదు. ప్రేమకీ పెళ్ళికీ కలయిక ఉండకూడదు. ప్రేమించినవాణ్ణి ఎప్పుడూ పెళ్ళిచేసుకోకూడదు. ప్రపంచ మేధావులైన లియాన్ బ్లం, ఫ్రెంచిమినిస్టర్ లాంటి అనుభవజ్ఞులు చెప్పినమాటకాని మరోటి కాదు. నాకూ అనుభవం అయిందికాబట్టే గట్టిగా వ్రాయిగలుగుతున్నాను.

రఘు నేను ఈవూరొచ్చాక వివాహం చేసుకున్నాం. అంతే అంతటితోటి రఘుతో నింత పరిణామం కలిగింది. దానికి

నేనాశ్చర్యపోయాను. ఈ మార్పు కారణం ఏమిటో అనిదీర్ఘంగా విమర్శించాను- ఏమీ లేదు- పెళ్ళి చేసుకోవడమే పెద్దముప్పొచ్చింది- "నువ్వు లేందే నేజీవించలేను" అన్న రఘు ఈనాడు నన్ను నిరసనగా చూడ్డం మొదలెట్టాడు. "మెళ్ళో పుస్తె కట్టాం ఇంక మనల్ని విడిచి ఎక్కడకెళుతుంది" అనే అభిప్రాయం ఇప్పుడు పెళ్ళవగానే రఘులో కలిగింది. "నీ ప్రేమదాసుణ్ణి" న్నాడు. ఇప్పుడు ప్రణయం యింకిపోయింది. "దాసీ" నయ్యాన్నేను. ప్రేమకీ పెళ్ళికీ ముడిడితే వచ్చే పాట్లే ఇవి.

ఇప్పుడు నాహృదయం ఎంతో క్షోభిస్తోంది రఘుకీ నాకూ ఏమీ భేదం లేదనుకున్నాను. ఆనాటి మనవ్యూళ్ళో బీచ్ దగ్గరన్న మాట్లకి మురిసిపోయాను. రఘుకి మనస్సిచ్చాను. అప్పుడు రఘు మనస్సిచ్చాడునాకు. పెళ్ళయింది. పెడమొహాలొచ్చాయి. ఎప్పుడూ ఎరగని ఆజ్ఞలూ, శాసనాలు ప్రవేశించాయి మాయిరువురిమధ్య. నాకు విసిగెత్తింది. విచారించాను. మొత్తుకున్నాను. ఏంలాభం? ఇంటికి రావడానికి ఏ మొహంతో వస్తాను?

ఆఖరికి తెగించాను. రఘుని పొమ్మన్నాను. నీకూ నాకూ పెళ్ళవ లేదన్నాను. ఇంతగా అతన్ననడానికి కారణం నన్ను నిరసనగా చూడ్డమే. ఎప్పుడూ ఎన్నడూ ఎరగని పోటు మాటల్తో నాహృదయాన్ని కుళ్ళబెట్టాడు. పెళ్ళి చేసుకుని నాకు బానిసత్వాన్ని ఇచ్చాడు. ఎన్నోసార్లు అతన్ని పూర్వంలా వారించాను. గట్టిగా మాట్లాడేను. "ఆఁ మొగుణ్ణే అంత మాట్లంటావ్?"

అన్నాడు. ఎంతటి అజ్ఞానం ఆవేశించింది రఘూని అని విచారించాను.

ఇప్పుడు రఘూ బొంబాయి వెళ్లిపోయాడు. నేనొక్కర్తినీ ఉన్నాను. జీవనం ఎలాగ గడుపుతున్నావని అడుగుతావేమో- నేను నీచవృత్తి నవలంబించలేదు- నీచవృత్తి నాదరి కెందుకు చేరుతుంది? ఉన్నతాశయాలుగల స్త్రీకి అలాంటివి దగ్గరకు రావు- గరల్స్‌స్కూల్లో ఉద్యోగం సంపాదించాను. ఉద్యోగానికికూడా ఎందుకు సిద్ధపడవలసొచ్చిందంటే రఘు నన్ను పోషించలేకపోయాడు. ఆరో నెల నాకిప్పుడు. గర్భంకూడా వచ్చిందని రఘు నాతో చెప్పకుండా ఉడాయించాడు. బొంబాయి చేరేక ఉత్తరంవ్రాశాడు. అందుకైనా సంతోషించాను.

ఇంతటి విపరీతాల్తో నాజీవితం గడిచింది. ఇప్పటికి కాస్త గుండెదడ తగ్గింది. ప్రశాంతజీవనాన్ని గడపడానికి పూర్వపు నాఆశయాల్తో జీవనాకమ ఈడవడానికి ప్రయత్నించడానికి అవకాశాలు కలిగాయి. రేపో ఎల్లుండో ఆస్పత్రిలో జేరతాను.

నీకు విసుగెత్తుతోందేమో నాజీవితచరిత్ర. ఇంక నీకివ్వవలసిన సలహా ఏమిటంటే కాలాన్ని చదువుతో వెళ్ళబుచ్చు- పెళ్ళయేవరకూ ప్రేమలో మనస్సుని పోనివ్వకు. స్కూలుఫైనల్లోగా ఓయింటిదానవవు. తరవాత నీభర్తనే అనుసరించు ప్రేమించడం- సేవించడం నీభర్తనే. పెళ్ళవగానే చదువుమానెయ్యి అప్పటికి నీకు కలిగిన విజ్ఞానంచాలు. గృహలక్ష్మివై నా

యీ కోర్కెల్ని నెరవేరుస్తావని తలుస్తాను. తప్పక నెరవేర్చు-
నావలపాల్ని విమర్శనాదృష్టితో నీబుద్ధితో ఆలోచించు. భగవ
దనుగ్రహం ఉంటే ఎప్పటికైనా ఈ నీ కమలం అక్కయ్యను
సన్యాసినిగా చూడ్డంవుగాని. నన్నుచూడ్డానికంత తొందర పడ
క్కర్లేదు. అందర్నీ అడిగేనని చెప్పు.

ఇట్లు,

నీకమలం అక్కయ్య.

[చిత్రగుప్త- అక్టోబరు 1941]

# శ శి.

ప్రేయసిగా రెండేళ్లు, భార్యగా రెండు నెలలు ఉన్న శశి, పదిరోజులనుంచి కొత్తపరిచయస్తురాలుగా ఉంటూన్న ఆమె మనస్తత్వాన్ని గ్రహించడానికి, ఎన్నోప్రయత్నాలు చేస్తూ కష్టపడుతున్నాను.

ఆమెలో ఇంత అకస్మాత్తుగా పరిణామం ప్రవేశించ డానికి ఏదో తీవ్రమైన, వింత అభిప్రాయం శశితో పరిచయం చేసుకొని ఉంటుంది.

ఈ పది రోజులనుంచీ నా పట్ల ప్రదర్శిస్తున్న ప్రవర్తన నిబట్టి, ఆమె కారణాన్ని అడిగితే నిజంచెప్పతుందన్న నమ్మకం లేదు. నిజానికీ, ఆమ్వరు పాలకి, చాలాదూరం ఉంటుంది.

ఒకనికి భార్యగా అవుతేనేగాని, ప్రపంచం తనకి మంచి నివ్వదనే ఆశయంతో భార్యాత్వాన్ని స్వీకరించేవరకూ, తను చేసే వంచనల్ని గ్రహించలేక పోతున్నాం.

అలాఅంటే శశి నాతో గడపిన విద్యార్థి జీవనం స్మరణ కొస్తుంది......... నిజమే నన్ను వంచించడానికే ఆమె తీయగా మాట్లాండ్డం, వెకిలిగా నవ్వడం !

"నీకు సరిపడ్డ అనార్కలీ దొరకలేదోయి సలీం! మన ప్రిన్సిపాల్ ఒప్పుకోలేదు కాని నేను ఆపోర్షన్ తీసుకుంటే, ఎంతో బాగుండునని పిస్తోంది". అని మాకళాశాల నాటక ప్రదర్శనం అయిన వెంటనే నాదగ్గరకొచ్చి అభిప్రాయాన్ని నేను కోరినట్టు మాట్లాడింది ?......నిజంగా నామనస్తత్వం ఆనాడు, ఆసమయంలో, ఆమె దగ్గర్నుంచి ఇలాంటి అభిప్రా యం వస్తే బాగుండుననే అనుకునే వాణ్ణి! కుర్రతనం! వెకిలి తనం- అజ్ఞానం! నాకన్నముందుగా ఆమె అలా అనడంతో నేను- బోనులో ఎలుకనయాను.

* * * *

తలుపు కీచుగా అరిచింది- శశి ప్రవేశించింది. తన చిన్న నాటి స్నేహితురాల్తో.

"మంచినీళ్ళు కావాలా?" శశి ప్రశ్న.

"అవసరం లేదు"

"మందు తీసుకోండి"

"ఇంకా సైముంది"

నాకాళ్ళ దగ్గర కూర్చొని ఆమె స్నేహితురాలితో, “పదిరోజులే అయింది పథ్యం మానేసి. ఇంకా బలానికి మందు తీసుకోవాలని చూస్తున్నారు. డాక్టరు ఏది ప్రిస్క్రైబ్ చేస్తే అది కావాలి.” అంది. ఎంతో పతిభక్తిని ప్రదర్శించింది. చూడ్డానికి వచ్చిన ఉమ ఆశ్చర్యపోతూ “చాల తీవ్రమైన జబ్బు... నీఅదృష్టం...” అంది.

నేను తీవ్రంగా శశికేసి చూస్తున్నకొద్దీ, ఈపది రోజులున్నంచీ, ఆమె ప్రదర్శించని భావాలు కనిపిస్తున్నాయన్న ఆశ్చర్యంతో, నేనా ఉమను పలకరించడం, నిజంగా మరచాను.

ఇప్పుడామె చెయ్యి, నాకాళ్ళ నొత్తుతోంది. నేనింకా ఆమెకేసి వెర్రిగా చూడ్డం ప్రారంభించాను. ఉమ “మనిషి చాలా మారిపోయాడు.” అంటూ లేచింది. శశి నిలబడింది.

ఉమ వెళ్ళి గంటవుతుంది. ఈ లోగా నేను కేకేసినా పలకని శశి పదిహేనునిముషాలకి రాఘవతో ప్రవేశించింది. వాడు తిన్నగా నాపక్కమీదనే కూచున్నాడు. శశి మంచినీళ్ళు కావాలా-మందు తాగుతారా అన్న ప్రశ్నలకి వెనకటి సమాధానమే ఇచ్చాను. ఆమె తొందర తొందరగా నారింజకాయని రెండు ముక్కలుగా కోసి రసం గ్లాసులో పోసి నాకందిస్తూ తాగండి-నీరసం తగ్గుతుంది అంది. ఆమె మొఖం చూస్తే సహృదయంతో సానుభూతి చూపుతోందని నమ్మానుకాని ఉమ వెళ్ళిన తరువాత నాపిలుపుకి జవాబు రాకపోవడంతో మళ్ళీ సందేహించాను.

రఘు "శశి చాల శ్రమపడుతోంది" అన్నాడు వెడుతూ.

నిజంగా శశి చాల శ్రమపడుతోంది- నన్ను చూడ్డానికి వచ్చేలోకం శశి పతిసేవ బాగానే చేస్తోంది అని గ్రహించడానికి చేస్తూన్న ప్రయత్నాలతో శ్రమపడుతోంది. "నటించడం" అన్నది స్త్రీలసొత్తు. ఇంతగా వంచించే శక్తిసామర్థ్యాలు ఆస్త్రీ స్వరూపంలో తప్ప మారెక్కడా కనిపించవు.

రోజూవచ్చే స్నేహితుల సంఖ్య హెచ్చుతూంటే బాగుండు ననిపించింది. నామెప్పుకై ప్రయత్నించడం శశికిప్రధాన లక్ష్యంకాదు. లోకాన్ని, నాతోపాటు వంచించి "భేష్" అనిపించేలా చెయ్యడం! దానివల్ల శశికి ఏఫలితం ఉంటుంది? ముందు తనేమన్నా చేసే తప్పులకి, కారకుణ్ణి నేనయిలా లోకం గుర్తించడానికేమో !

ఈ నటన నన్ను చాల బాధ పెడుతోంది. వెంకిని కేకేసి శశిని దగ్గిరుండి పిలుచుకు రమ్మన్నాను. ఏ దృష్టితో ఉందో శశి వచ్చి పేథుల్ని కిటికీగుండా చూస్తూ "ఏం?" అంది.

"నిన్నర్థం చేసుకోలేక పోతున్నాను అన్నాను"

"—కష్టం"

"ఈ పదిరోజుల్నుంచి, నన్ను చూసే స్నేహితుల్లో కలుస్తున్నావేం?"

"అదే మీారు కనిపెట్టడం కష్టం అంటున్నా"

"కారణం?"

"మీరే గ్రహించుకోవాలి"

"ఈమె నాలో కనిపెట్టినమార్పు ఏదీ ?' అని తీవ్రంగా ఆలోచించాను. శశికి కష్టంకలిగే చర్య నేనొక్కటీ చెయ్యలేదు. ఆమె తనంతట తానే మార్పు తెచ్చుకుంది.

"కారణం నువ్వే చెప్పాలి." అన్నా నాకలాంటి సందేహమూ లేదు ఆమెను హింసించే చర్య నేను చెయ్యలేదని చెప్పడానికి. ఆమెలో కలసి తిరిగే క్షణాలకోసం తపస్సు చేస్తున్న నేను, తప్పునాదేఅని నేనెలా అనుకునేది. అయినా నాకు తెలియకుండా నేనేదైనా ఆజ్వరతీవ్రంలో అన్నానేమో!

శశి గబగబ నా ఫొటోతోనూ, అద్దంతోనూ నాదగ్గరకువచ్చింది అద్దం నాముఖాని కెదురుగుండా పెట్టుకుంది. రెండోచేత్తో అద్దానికి పక్కగా నా వెనుకటి జబ్బుచెయ్యక ముందు నాటి ఫోటో పట్టుకుంది.

నిజంగా, భౌతికంగా నాలో మార్పు కలిగిందని అద్దమే చెబుతోంది. ఇరవైఐదుఏళ్ళనుంచి నాఆకారాన్ని బాగా నాకు అద్దంసహాయం లేకుండానే చూచుకుని సంతృప్తిపడే క్షణాలన్నీ జ్ఞప్తికివచ్చి అద్దంఇచ్చే సాక్ష్యాన్ని నమ్మలేకపోతున్నాను. నిజంగా ఆమార్పుకు నేను కాదుకారణం- నన్ను పీడించుకుతిన్న రోగమే ! కాని ఆమార్పుకి ఫలితాల్ని నేనే అనుభవించాల్సి వచ్చింది.

"అయితే స్నేహితులముందు నాపై అనురాగాన్ని ప్రదర్శించటంలో నీభావం ?" అని శశిని అడిగేను, శశి జవాబు ఆలోచించి "ఏమీలేదు" అంది.

కొంచెముసేపు ఆగి విచారంగా "మీతో జీవితాన్ని గడుపుదామనీ, పిల్లలకి తల్లినౌదామనీ తలచాను. కాని" అవి స్వప్నసుఖాలయే యని ఈనాడు గ్రహించాను. మీలో ఇంత అందవికారం ప్రవేస్తుందని అనుకోలేదు. మీరు జబ్బుపడి నెమ్మదించినదగ్గర్నుంచీ మానసికంగాకూడా మారిపోయారు." అంది.

ఇప్పుడు గ్రహించాను ఉమ 'చాలమారిపోయారు' నా ఎదురుగుండా, శశితో అనడంలోని భావాన్ని.

అయితే శశి, నా అందాన్ని చూసి ప్రేమించిందన్నమాట- అంతేనా?

అందుకు శశి ఏం జవాబు చెప్పగలదు?

నేనా శశా? ఎందుచేత?

ఎవరు, ఎవరిని మార్చారు?- లేక ఎవరికి వారే మారిపోయినారా?

ఇందుకు నాకీజవాబు తోచడంలేదు.

శశిని అడగనా, మాననా?

మానుకుందామన్నా, మనసు నిలవేస్తూంది- అడిగి తెల్సుకోమని.

అడిగినా...

అందుకు శశి ఏం జవాబు చెప్పగలదు?

[ఫిబ్రవరి 1943]

# తా ర.

## 1

పద్నాలుగు వసంతాలే గడిచాయి. ఆనాడు నాపుట్టిన రోజు. సంగీతం మేష్టారు మామూలు వేళకేవచ్చి "పుట్టినరోజు బహుమతి ఏమిస్తావ్?" అని నవ్వుతూ అడిగేరు. "నేనేం ఇవ్వ గలనండి? ' అంటూ నా దేహంకేసి చూస్తూ అన్నాను. "రేపు నీకు కన్నెరికం చేస్తారటకదూ?" అని మళ్లీ అడిగేరు. ఆయన ఆశ నాకర్థం అవకపోలేదు. బహిరంగంగా ధైర్యంగా కన్నెరి కం విషయం నన్నే అడిగినందుకు నాకప్పటికే మా కళావంతుల శీలాన్ని పూసగుచ్చినట్లు మా అమ్మ చెపుతూండడంవల్ల నే నేమి అసహ్యపడలేదు. నిజంగా నాకు రేపే కన్నెరికం అని ఆ సమయానికి వేయికళ్లతో నిరీక్షిస్తున్నాను. "ఆమహానుభావుడెవరో నువ్వెరుగుదువా?" అని ఆయనకు తెలిసినట్టు కాకుండా తెలవనట్టుకాకుండా ఒక విధమైన ధ్వనితో అడిగేరు "నాకింకా తెలియదండీ?" అన్నాను. నాకు పాఠంచెప్పారు రేపు వస్తానని వెళ్లిపోయారు మేష్టారు.

## 2

సంగీతం నేర్చుకోవడం ఈనాటి మాజాతివాళ్లకి అంతముఖ్యమైన విషయాల్లోకి రాదు. ఆడదానికి స్వతస్సిద్ధంగా ఉండే గొంతుకతోటి ఈనాటి సినీమాస్టారుల్ని ఇమిటేట్ చేస్తూ మాభావాల కనుగుణంగా బూతుపాటలు పాడలేని వా

ళ్లు చాల తక్కువగా ఉంటాయి. నాలుగైదుసార్లు సినిమాకి వెడితే ఆ స్వరాలు అప్రయత్నంగా వచ్చేస్తుంది. ఆపాట ఒకవేళ అపస్వరంగా పలికినా, అభినయం రాకపోయినా గజ్జెకట్టి వీధిన పడి గెంతే సమయంలో మేంచేసే అభినయం, మానోటినుండి జారేపాటతో తన్మయత్వాన్ని పొందే సజ్జు ఇంకా లేకపోలేదు అంచేత మా సంగీతజ్ఞానం, మా అభినయశాస్త్ర ప్రావీణ్యం పరీక్షకొచ్చే పాతరోజులు పోవటంతో మేం "వరవీణా మృదుపాణీ" దగ్గర్నుంచి ప్రారంభించడం మానేసినట్టే లెక్క. పేరుకి సంగీతం మేష్టరంటూ ఒకరువచ్చి సంగీతం నేర్చుకుంటూందని మాకు సంబాధించినలోకం అనుకుని ఆనందించడానికి తప్ప మరో ఉద్దేశ్యంలేదు.

## 3

ఆనాడు నేపడినబాధ భగవంతు డెరుగును. నాయవ్వనాన్ని తొలిసారిగాని అనుభవించేందుకు నిర్ణయింపబడ్డ వ్యక్తితోనే పడినబాధ ఆదేవుడికే తెలుసు. మాఅమ్మ ఒకర్తేకాదు, మా జాతిలోని యువతుల తల్లులంతా ధనానికి ప్రాముఖ్యత నివ్వడంతో మా శీలాలూ, మా మానాలు అవసవ్యంగా, అనవ్యాయం, వృథాగా పాడుచేసిన వారౌతున్నారు. అయన్ని "నువ్వు నా తండ్రివి—వదిలెయ్యి" అన్నాను. "మూడు వంపులకీ నీళ్లువొదులుకుంటానా వెర్రిపిల్లా" అన్నాడాయన. యువతుల కోసం అందులోనూ అనాఘ్రాణిత పుష్పాలకోసం ప్రాకులాడే

బుద్ధివయస్సు వైపు మరలకుండా పెడత్రోవలు తొక్కుతుంది. జీవితాంతంవరకూ అధికసంఖ్యాకులుగా వ్యక్తుల పరిచయం మాకు కలుగుతుందనీ, అందరికీ ఆనందాన్నివ్వడానికి నే ప్రయత్నించాలన్నది నావిధి అనీ నాకు తెలుసున్నా జానెడు పొట్టకోసం జీవితాన్ని నాసుఖాన్ని నేను చంపుకుని ఎంతకాలం తొయ్యగలను ? ఈ నిర్బంధం ముఖ్యంగా నా తల్లిదగ్గర ఉండడం వల్ల కలుగుతోంది. నాకు తోచినవ్యక్తిని నేను ప్రేమించకోవడంలో స్వాతంత్ర్యం ఎక్కడ దొరుకుతుందో అక్కడికే పోతాను. ప్రపంచ చరిత్ర మాది అసహ్యపు వృత్తి అని ఎలాగా చాటుతోంది! ఇంక నాసుఖంకోసం బహిరంగంగా నడచినా నన్ను నిందించే వారెవరున్నారు? నాచర్యలకి శాపాలు నాజాతికి తగులుతాయి కాని కర్తని నేనైనా నాకు రావు

## 4

పొద్దున్నే లేచి నామొహాన్ని ఎదురుగుండా ఉన్న అద్దంలో చూచుకున్నాను. మొహం కందిపోయింది. నా అయిష్టాన్ని తెలిపిన కారణాన నన్ను కొట్టాడాయన. నా జుట్టు చిందరవందరగా ఉంది. నాబట్టలన్నీ నలిగిపోయాయి. ఒక్కసారిగా గట్టిగా ఏడ్చాను. తొలిసారి సుఖానుభవంలోనే నాకు అసంతృప్తి, దెబ్బలు, పరాభవం కలిగిన నా జీవితం ఏం కాను ? డబ్బు నాకు కావలసిన సుఖాన్నివ్వగలదా ? ఈ యింట్లో, ఈ నాలుగు గోడలమధ్యా నా తల్లి ఉరుములు, అనుపుల్లో ఉం

టే నా జీవితం అంతా అడవిలో కాసిన వెన్నెల ఫలితమే! నేను రాత్రిపడ్డ బాధ నాలో పొంగి పైకివస్తుంది. ఎవరితోనో చెప్తేనే గాని నాకు మనశ్శాంతి కనపడటం లేదు. ఎవరితోటి చెప్పి నా బాధని నివారణ చేసుకోను? అలాంటి వ్యక్తులేరి? అమ్మ, పిన్నమ్మ కర్రలు పుచ్చుకుంటారు. ఆ—సంగీతం మేష్టారు—వస్తారు. ఈ లోపుగా స్నానంచేసి రెడీగా ఉంటాను. నాలో విచారం ప్రవేశించిందని నా బుగ్గలు, మొహం చెప్పక చెపుతాయి. నా హృదయాన్ని వేళ విప్పి ఆయనెదుట పెడతాను.

## 5

మేష్టారునవ్వుతూ మెట్లెక్కుతున్నారు. మాఅమ్మా, పిన్నమ్మా ఆయనతో "మా రత్నానికి జావళీలు, స్వరజతులు చెప్పండి అబ్బాయిగారూ!" అంటున్నారు. ఆయన 'అలాగే' అన్నారు. తిన్నగా నేను చాపవేసి హార్మోనియం తెచ్చి కూర్చుని నా దృష్టిరీడ్సుకేసే ఉంచాను. కొంచెంసేపు ఆయనలో ఆయన నవ్వుకుని "రత్నానికి ఈవేళ నేనంటే ఎక్కడలేని సిగ్గూ వచ్చిందనుకుంటాను" అన్నారు. మేష్టారుచేసిన వేళాకోళంలో సున్నితం, అర్థం ఉన్నా ఒక్కొక్కరు మమ్మల్ని చేసే పరిహాసాల్లో నా చెవులు సహించలేని మోటతనం ఉంటుంది. నేను ఆయనకేసి చూశాను. ఆయన ఆశ్చర్యాన్ని ప్రదర్శించారు. "ఏమిటి రత్నం- ఈదెబ్బలు?" అన్నారు. మెల్లిగా "నాఖర్మం" అన్నాను. ఆ జవాబుతో ఊరుకోకుండా గట్టిగా ఏడవడం ప్రా

రంభించాను. ఆయన నాతల నిమురుతూ, నాచీర కొంగుతో నాకళ్ళను తుడుస్తూ "ఏమిటీ ఏడవడం?" అన్నారు. ఏడాదినుంచి నేనాయనదగ్గర పాఠం చెప్పించుకుంటున్నా నా తల, నాకళ్లూ ఆయని స్పర్శ నెరగవు. మెల్లిగా జరిగిన ఉదంతాన్నంతా చెప్పి నాహృదయభారాన్ని తగ్గించుకున్నాను. మేష్టారూ బాధపడ్డారు గాని భావికర్తవ్యానికి సూచనలేవీ చెయ్యలేదు. నాప్రోత్సాహంతోనే ఆయన పట్టణంలోఉన్న స్టూడియోకి పోయి జీవితాన్ని స్వేచ్ఛగా గడపడానికి నిశ్చయించుకున్నా—నాయందు ఆయన కెంత ప్రేమ!! నాతోపాటు ఆయనా కళ్లమ్మట నీళ్ళు తెచ్చుకున్నాడు నాబాధను విని—ఈ ఇంట్లోంచి ఊడి అవతలపడడం ఎలాగ అని ఆలోచిస్తూండగా అమ్మా, పిన్నమ్మా నవ్వుకుంటూ "రాత్రి రత్నం మొదట పెంకితనం చేసిందట—ముండ- రెండు వాయించేటప్పటికి ఊరుకుందట—అయిష్టంట—ఇష్టమైన వెధవలు గుమ్మరిస్తారు కాబోలు! మా బాగా చేశాడా శెట్టిగారు—మొట్టమొదలే ఇలాచేసి బుద్ధి నేర్పేడు!" అనుకుంటూ పైకి వస్తున్నారు. మా ప్రోగ్రాం ఈలోగా నిర్ధారణ చేసుకున్నాం. అమ్మా, పిన్నమ్మా మాదగ్గరికి వచ్చారు. మేష్టారు అమ్మతో "రేపు రత్నమ్మకి గృహలక్ష్మి సినిమా చూపించాలి—ఏమంటావ్" అన్నారు. "తీసుకెళ్లండి బాబూ—మాకు పనికివచ్చే ముక్కలు దొరికే సినిమాకి వెళ్లొద్దంటానా అబ్బాయిగారూ?" అంది.

## 6

గృహలక్ష్మి సినిమా చూశాం. నాలో సినీతార జీవితాన్ని గడపాలనే తీవ్రవాంఛ అప్పుడే ప్రవేశించింది. మేష్టరు నన్ను హుషారుచేస్తూ "నిన్నలాంటి తారని చేస్తాను. చూడురత్నం" అన్నారు. ఆమాటకి నేనప్పుడే తారాపథంలోకి పోయాను. జట్కా తిన్నగా స్టేషనకి తీసుకుపోయింది. మేష్టారు తెలివి తేటలుగా టిక్కెట్లు సామర్లకోటవరకూ, తరవాత బెజవాడవరకూ, అక్కణ్ణుంచి చెన్నపట్టణానికి తీసుకున్నారు. అమ్మా వాళ్లూ మా రైల్వేస్టేషన్‌లో ఇంక్వైరీచేస్తే మా గమ్యస్థానం తెలియకుండా ఉండడానికలా చేసినందుకు ఆయన్ని అభినందించాలి. "నేను ఫిలింలో ఏక్టు చెయ్యడానికి పోతానం"టే మా అమ్మ "ఈఊళ్లో కాతాలు పోతాయి—నువ్వుపోతే మానోట్లో మట్టే—ఎలాగైనా చిన్నప్పట్నుంచీ ఉన్న ఊర్లో దొరికినట్లు పై ఊళ్ళో దొరుకుతుందా?" అన్నమాటలు జ్ఞప్తికి వచ్చాయి. కొంచెంసేపు విచారించాను. వాళ్ళనోట్లో మట్టిపడ్తుంది! యవ్వనమే మమ్మల్ని పోషించేది! అమ్మ, పిన్నమ్మల్లో అది నశించింది! ఇంక వాళ్ళకి నలిగిపోయిన పువ్వులగతే!

## 7

వెంకటరావుగారు (మా సంగీతంమేష్టారు) పట్టణంలో మంచి బసచూశారు. ఆయనకీ పెళ్ళాం, పిల్లలూ లేరు. మేము ఇద్దరం స్వేచ్ఛగా ఒక్కఇంట్లోనే ఉంటున్నాం. ముందుగా వెం

కటరావుగారూ, నేనూ ఫోటోస్టూడియోకి వెళ్లాం. అక్కడ నా పోజులు అరడజను తీయించాను. ఆఖరున "మనం ఇద్దరంకలిసి ఒక పోజు తీసుకుందామండీ" అని నేనేఅన్నాను. నాపట్ల ఆయన చూపుతున్న సహాయానికి కృతజ్ఞత ఇలా గేనా చూపించొద్దూ? మేష్టారు ఆనందంతో నాపక్కన భుజంమీద చెయ్యేసి నుంచు న్నారు "రెడీ...త్రీ"తో మేం ఇద్దరం ప్రపంచానికిలా తెలియ చేయబడ్డాం. మర్నాడే మూడన్ని ఎన్‌లార్జి చేయబడిన ఫోటోలు వచ్చాయి వాటిని మేష్టారు డైరక్టర్లకి చూపడానికి రోజు కో డైరక్టరు దగ్గరకువెళ్ళివచ్చేవారు. పొద్దున్న నాఫోటో డైరక్టరు దగ్గరకువెడితే మధ్యాహ్నం వాళ్ళకోరికమీద నేనువెళ్లేదాన్ని. ప్రథమంగా నేనెక్కిన స్టుడియోలో, లోపల ప్రవేశించగానే కనపడ్డదృశ్యం ఓ తార ఒకాయనతో సరసాలాడుతోంది నేను వచ్చినట్లు డైరక్టరుకి తెలియగానే దగ్గరకువచ్చి "రండీ" అంటూ అక్కడున్న కుర్చీల్ని చూపాడు. కూచున్నాం. డైరక్టరుగారు నాకేసి దీక్షగా చూస్తున్నాడు. ఇటూ అటూ చూశాడు. ఆయనముఖంలో ఓమారు ఉత్సాహం ఓమారు నిరుత్సాహభా వాలు ప్రదర్శింపబడ్డాయి. పదిహేనునిమిషాలిలా పరీక్షించిన తరవాత "ఆల్‌రైట్- రావుగారూ! ఈమె స్క్రీన్‌కి ఫిట్ అవు తుందండీ! మరి ఈమె ఎప్పుడైనా డ్రామాలో Act చేసిం దా?" అని ప్రశ్నించారు.

మేష్టరు "లేదండి- స్టేజి ఎప్పుడూ ఎక్కలేదు. గజ్జెకూ డా కట్టలేదు ఆమె తొలిసారి అనుభవంలోనే విరక్తికలిగి ఇలా

వచ్చేసింది" అన్నారు. మేష్టారులాంటి పక్షీంద్రులు అందరితా రలకీ ఉన్న సంగతి అప్పటికే నాకు రూఢీ అయింది.

"పాట చూడాలి- కంఠం మైక్‌కి ఫిట్ అవుతుందో అవ దో-" అన్నారు.

సినిమా ప్రవేశానికి ఇంత కఠినపరీక్షకి లోనవాలని నాకు తెలీకపోవడం నన్నాశ్చర్యపరుస్తోంది.

"పరీక్ష చెయ్యండి" అన్నారు మా మేష్టారు. డైరక్టరు ఎవర్నో పిలిచారు. పక్క నేఉన్న హార్మోనీసీట్ మీద కూచుని "నీస్రుతి ఎంత?" అని అడిగేడు. మేష్టరు నాబదులు చటుక్కున చెప్పేశారు కాని స్టుడియోలో అడుగుపెట్టినదగ్గర్నుంచి పరిచ యంలేని వ్యక్తులుకూడా 'నీ' అనడం నన్ను ఒళ్లు మండించింది. ఆసంబోధన వాళ్ళకి నాజాతి నేర్పినపాఠమే! పాశ్చాత్యదేశాల్లో రాత్రి ఎనిమిదిమొదలు తెల్లారేవరకూ నీచవృత్తిలోని స్త్రీలని 'నీ' అనడానికి లైసెన్సుఉంది. తెల్లవారినతరవాత వాళ్ళని ప్రతీ వారూ మన్నిస్తూమాట్లాడాలి! వృత్తిలో నీచమేముంది? మా జాతికి నీచాన్ని ఆపాదించింది లోకమే! అయితే వ్యక్తిత్వాన్ని పోగొట్టుకోవాలని ఉందా ?

"మేష్టారూ! మీరు వాయించండి" అన్నాను నేను. డైరక్టరుకూడా కొత్త అనుకుని సరే అన్నాడు. మేష్టరు అంది స్తూంటే నేను హాయిగానే పాడాను.

## 8

"ఏమాత్రమూ సినిమా అనుభవమూ, విజ్ఞానమూ లేని తారలని పోషిస్తూ పిక్చర్ తీయడంలో చాలనష్టానికి గురవడమే కాకుండా ఇటు ప్రొడ్యూసరు బాధకి అటు ఆంధ్రలోకం బాధకి గురవడానికి నాకిష్టంలేదన్నారు." నిన్న నన్ను పరీక్షచేసిన డైరక్టరుగారు. మేష్టారు "ఈయనకి బుర్రలో సరుకు తక్కువవడం మూలాన్ని ఆంధ్రలోకం ఆందోళనచేస్తూన్న నూతన తారల్ని సృష్టించలేడు" అన్నారు. "నిజమేనండీ" అన్నాను నేను. అందం, మంచిగొంతుకఉన్న నన్ను బుక్ చేసుకోవడానికేం? సినిమాకి కావలసిన అభినయం అలవడ్డానికి ఎంతకాలం, ఎంత శ్రమ వినియోగపరచాలి !!

"మన కర్తవ్యం ఏమిటింక ?" అన్నాను. "ఇంకో డైరక్టరు దగ్గరికి వెళదాం—నీ అందం, నీ పాట ఎవన్ని ముగ్ధుణ్ణి చెయ్యకుండా ఉంటుంది? నీకేకాదు ఆ డైరక్టరికి లేదు సినిమా అనుభవం—" అన్నారు మేష్టారు. మర్నాడు మైలాపూర్ పోయాం. ఆ డైరక్టరుగారు ఫిలింసగం పూర్తిచేసి డబ్బులేక కాళ్లూ చేతులూ తేసివేసిన కుర్చీలో శూన్య దృక్కులు ప్రసరిస్తూ కూర్చున్నాడు. మా మేష్టారికీసంగతి తరవాతగాని తెలీలేదు. మేం లోపలికి వెళ్లేటప్పటికి ఎక్కడలేని ఉత్సాహాన్ని ఎరువు తెచ్చుకుని "కమ్ ఇన్" అన్నారు మేం ఆసీనులయాం, మేష్టారు మా విషయం చెప్పారు. నన్ను డైరక్టర్ సాబ్ అన్ని

angles లోనూ పరీక్షించారు. నా పాటనీ పరీక్షించారు "స్క్రీన్‌కి సరిపడ్డ ముఖం ఉంది—పాట బాగుంది ఇంక action అంత అవసరం లేదు— మీరు నా స్టుడియోలో ఉండండి" అన్నారు. చాలసంతోషించాం—"రాత్రి ఎనిమిదింటికి రండి. షూటింగ్ చూద్దురుగాని" అన్నారు.

రాత్రి పెందరాళే భోంచేసి నేనూ మేష్టారూ వచ్చాం. డైరక్టరుగారువచ్చి "మీ పేరేమిటి?" అన్నాడు. "రత్నం" అన్నా. మిమ్మల్ని మా producer కి చూపిస్తాను రండి" అన్నాడు. ప్రొడ్యూసర్ రూమ్‌కి వెళ్ళాం, మేష్టారుమాత్రం డైరెక్టర్ మాట ప్రకారం అక్కడే కూచున్నారు. అప్పటికి కాగాలు, మిరియాలు ఎవరిమీదో నూరిఉన్నట్టు ముఖం గంభీరంగా పెట్టాడు. డైరెక్టర్ వణుకుతూ నన్ను చూపుతూ "This is our new Star, Ratnam" అన్నాడు. ప్రొడ్యూసర్ నన్ను చూసి చింకిం చేటంత మొహం చేసుకున్నాడు. "స్క్రీనుకి చాల అందంగాఉంటుందీమె, పాట బాగా పాడుతున్నారు. మీరు మా స్టుడియోకి దొరకడం మా అదృష్టం. మేం మీలాంటి తారలు దొరక్కపోవడంతో నిరాశ చేసుకున్న విషయాల్లో మీవల్ల మేము ఓదరికి రాగలం" అని నన్ను అద్భుతంగా పొగుడుతూంటే ఆపొగడ్తలకి సమాధానం ఎలాచెప్పాలో తెలియక పోవడంతో నా చెవుల్ని ఆయనకి అప్పగించి కళ్ళని నా కాలిగోళ్ళకి ఇచ్చాను. ఆయన ఆలాగ

నాకుశాంప్లి పెంట్సు ఇస్తు నా పక్క కుర్చీలోకిచేరి నన్ను గట్టి గా పట్టుకున్నాడు, పక్కకి చూశాను, డైక్టరు ఎప్పుడు అంత ర్ధానమయ్యాడో తెలీదు. ప్రొడ్యూసర్ నా చెవులో "నీకు తా రాపథంలో ఉత్తమస్థానాన్ని సంపాదించి పెడతాను...నీకు నెలకి వెయ్యిరూపాయలిస్తాను... రెండునెలల్లో నిన్ను కథా నాయికగా ఎన్నుకుంటాను...డబ్బు పెట్టి నేనే పిక్చర్‌లో నటీ నటుల్ని ఎన్నుకోవడం...నిన్ను నేను ప్రే...మిం...చా... ను." అంటూ నన్ను గట్టిగా కౌగలించుకుని ఆరూమ్‌కి పక్క నున్న గదిలోకి తీసుకుపోయాడు. అది ప్రొడ్యూసర్ ప్రైవేటు రూమ్ నంబర్ టు, దాట్లో పెద్ద పందిరి పట్టుమంచం ఉంది, నన్నా పరుపుమీద ఎత్తుకుని తీసుకునివెళ్ళి పడకోబెట్టాడు. ఈ పరుపుమీద నావంటి పధ్నాలుగేళ్ల యువతులు ఎందరు నలిగేరోకదా !!

## 9

ఆ స్టుడియోలో నేనూ, వెంకటరావుగారూ పనిచేస్తు న్నాం. ఆ ప్రొడ్యూసర్ ఎక్కణ్ణుంచో డబ్బు తెచ్చి మిగతా సగాన్ని పూర్తిచేయిస్తున్నాడు, నాలాడ్జికి రోజూ సాయంత్రం ఆరింటికి కారు పంపించేవాడు, నేను, నా సంగీతంమేష్టారూ స్టుడియోకి వెళ్లేవాళ్లం, అసిస్టెంటు మ్యూజిక్ డైరెక్టరుపదవి మా మేష్టారుకి వచ్చింది. నేనాఫిల్మ్‌లో నటించకుండా ఉండ డంమూలాన్ని మిగతా తారలకి పాటల నేర్పుతూండడంలో

ఆయన నిమగ్నులయారు. నారాక ఆ స్టుడియోలోని ప్రతి వ్యక్తి మొహంలోనూ నూతనసంచలనాన్ని రేకెత్తించింది. మేష్టారు కొత్తగావచ్చిన పదవిలో కాలాన్ని గడపడానికి నన్ను మెయిన్‌హాల్‌లోఉంచి వెళ్లేవారు. డైరక్టరు షూటింగ్‌మధ్యలో ఉన్నా హేట్ ఎత్తి నన్ను విష్ చేస్తూ 'కమాన్' అన్నట్లు చెయ్యిచాపేవాడు, డైరక్టరుదగ్గరికి వెళ్లేదాన్ని, ఓ అరగంట పోయాక ప్రొడ్యూసర్ బ్రహ్మం వచ్చేవాడు, నన్ను వెనకాల నుంచె చెయ్యిట్టుకు లాగుతూ తన రెండవగదిలోకి తీసుకుపోయేవాడు. ఓనాడు నేను "ఈ చిత్రంలోకూడా act చెయ్యాలని ఉందని" చెప్పాను. నామాట వినీ వినడం తోనే డైరక్టరుని పిలచి "రత్నానికి ఈ ఫిలింలో act చెయ్యాలని ఉంది. అవకాశాన్ని సృష్టించు" అన్నాడు, "జీహుజూర్" అన్నట్లు డైరక్టరు శిరశావహించాడు.

## 10

అది నేను ఫిలింలో ప్రథమంగా ప్రవేశించినరోజు, నేను స్టూడియోలో అడుగెట్టేను, డైరక్టరు గబగబావచ్చి మిగితా పనుల్ని ఎక్కడ వక్కడుంచి, "రత్నం ఈవేళనిన్ను ఫిల్ములోకి ఎక్కిస్తాం ఇదిగో నీపోర్షన్. ఏమీభయపడకు" అంటూ సెట్ దగ్గరకి తీసుకువచ్చి "కవిగారూ ఈమెకి పాటలేవీ లేవుకదండీ" అని అడిగేడు. కవిగారు "కావలిస్తే పాటలురాస్తా". అన్నాడు. డైరక్టర్. "రత్నం— పాటకావాలేమిటి ?" అని అడిగేడు

"ఊఁ" అన్నాను. పది నిమిషాల్లో పాట రెడీ అయింది. డైరెక్టరూ, కవి, అసిస్టెంటు డైరెక్టరూ ఇంకా నటీ నటులు నా చుట్టూ ఉండగా నా పోర్షన్‌ని చదివిస్తూ, అభినయం ఉచ్చారణ తెలియజేశారు. ఫైనల్ రిహార్సల్ చెయ్యమన్నారు అంతా రెడీ అయాక, డైరక్టరు, కవి చెప్పినట్లు మాటలన్నాను. వారిద్దరూ "వెరీగుడ్. వెరీగుడ్ రత్నం—ఇంత సులభంగా మా Ideas ని తూచా తప్పకుండా అనుసరించే తారని నిన్నే చూశాంగాని ఇంకెవ్వర్నీ చూడలేదు" అన్నారు. ఈలోగా ప్రొడ్యూసర్ వచ్చాడు. క్లాప్‌బోయ్ అప్పుడే ధ్వనిచేశాడు. ప్రొడ్యూసర్ నాకేసి అదేదీక్షగాచూస్తూ నించున్నాడు. షూటింగ్ పూర్తవడం తడవుగా ప్రొడ్యూసర్ నా దగ్గరకువచ్చి అంతమందిలోనూ వీపుమీదతట్టుతూ "A fine actress !" అన్నాడు. తొలి ప్రయత్నంలోనే, అయిదు నిమిషాల సెట్ మీద నడిపినంతలోనే స్టూడియో అధికార్లందరదగ్గరినుంచీ పొగడ్తల్నిపొందిన నాకు ఫిలిం నిర్మాణ విషయంలోనే అగ్రస్థానం వచ్చేసింది.

ఆనాటిరాత్రి మేష్టారు వారిపనిలో మునిగిపోయి ఉన్నారు. ప్రొడ్యూసర్ నన్ను నా లాడ్జికి దిగబెట్టాడు. మీాల్సు తీసుకుని నా స్టూడియోలైఫ్‌ని స్మరించుకుంటూ కూచున్నాను. ఎవరో తలుపుతట్టారు. తలుపు తీశాను. కెమేరామేన్ నాథ్ లోపలికివచ్చి కూర్చున్నాం. స్టూడియో గొడవలు మాట్లాడుకున్నాం. అరగంట జరిగింది. "తారకి సినీప్రపంచంలో అగ్ర

స్థానాన్ని ఇవ్వాలన్నా అధోలోకానికి దింపాలన్నా కెమేరామేన్ చెయ్యగలడు సుమీ !" అన్నాడు. అయితే నా ప్రాణాలన్నీ కెమేరామేన్ క్లిక్‌లో ఉన్నాయి. "నిజమే" అన్నాను. నవ్వుతూ నన్ను కౌగలించుకున్నాడు.

నాథ్ వెళ్ళి అరగంటయింది నిద్రపడుతూన్న సమయంలో మళ్ళీ తలుపుతట్టానా్నరెవరో, సౌండ్ రికార్డిస్టు చలం. "నీ భావిజీవితం అంతా నాపైనే ఆధారపడిఉంది" అన్నాడు.

పది అయింది తలుపుతట్టారు మేకప్‌మేన్ బాబు. "నిన్ను దిద్ది తీర్చి కెమేరాఎదుట పెట్టడంలోనే ఉంది. నీ అభివృద్ధి. కెమేరామేన్ నిన్నేం చెయ్యలేడు—నామేకప్‌తోనే ఎన్ని హృదయాలో నీకోసం పాకులాడే శక్తి నీకువస్తుంది" అన్నాడు.

ఎంతమందిమీద ఆధారపడి ఉంది నాజీవితం !!

పదకొండు అయింది. డైరక్టరుసాబ్ వచ్చాడు. వన్నెండయింది. అసిస్టెంటు డైరక్టరువచ్చాడు. డైరక్టరే అందరికన్న నా అభివృద్ధికి ఎక్కువగా పాటుపడేవాడు. ఈ తోకగాడు అసిస్టెంటు డైరక్టరేంచేస్తాడు ? పొమ్మన్నాను. వెర్రిమొహంతో వెంగళప్ప వెళ్ళాడు—రెండు నెలలయింది నాకు నాయికపాత్ర ఇవ్వడంతో వీళ్ళ ఒత్తిడికి ఆగలేకుండా ఉన్నాను. నా అయిష్టాన్ని తెలపకుండా వాళ్ళని సంతోషపెడుతూ ఫిలిం ఫీల్డులో నా శీలాన్ని మంటకలిపాను.

రూపవాణి, నవంబరు 1942.

# ఘటన.

ఆవేళ నన్ను పెందరాళే లేపేసింది మా అమ్మ. సాధారణంగా ఏడుగంటలుదాటేక లేచేమనిషిని ఈ నాడు చాలతొందరగానే లేవగొట్టబడ్డంలో ఏదో వింత విశిష్టత ఉండొచ్చని ఊహించుకుని నిర్ధారణ చేసుకున్నాను. పెందలకడే లేవడం నా దేహానికి ఆనవాయితి లేదు. ఆవేళ ఆనవాయితి తప్పడంమూలాన్ని ఈ క్షుద్రదేహం ఎంతో క్షోభించింది. ఈదేహానికి కావలసినవన్నీ సకాలంలో అందచెయ్యకపోతే ఎంతైనా కోపంవస్తుంది. ఆగ్రహం సత్యాగ్రహం అవుతుంది. అంచేత ఆ విషయంలో ఏమీ శక్తి ఉన్నంతవరకూ లోటుబాటు రాకుండా ఉండేలాగున ప్రయత్నిస్తూంటాను. అంత ఆర్టిఫిషల్ దేహం అయిపోయింది.

నేను లేవడం తరవాయిగా మా అమ్మ చెంబూనీళ్లూ పుడక పట్టుకొచ్చి అక్కడపెట్టి 'చవ్వీన మొహం కడుక్కోరా!' అని నిలబడింది. బద్ధకం ఎక్కువగాఉండడం మూలాన్న 'ఊఁ' అని గట్టిగా అన్నాను. అమ్మ హడిలిపోయింది ఇంక వీడు మాటలతోవినడని న్యాయంగా పుల్లని రుబ్బురోలు పొత్రంక్రింద నలగకొట్టి బ్రష్‌లా తయారుచేసి పట్టుకొచ్చి నానోట్లో పెట్టింది. 'లేరా నాయనా' అంటూ బతిమాలుతూ నాదేహాన్ని దొడ్లోకి తీసుకొచ్చి నూతిచప్టామీద కూచోపెట్టింది. అప్పటికీ బద్ధకం అనే పదార్థాన్ని నాదేహంలోంచి తీసివెయ్యలేను. మా అమ్మ

ఆతురతా ఎక్కువవుతున్నట్లు ఆమె మొఖమే చెప్తోంది. ఆల స్యాన్ని భరించలేకపోయింది గబగబవచ్చి నాతలమీాద చెయ్యే సి పుల్లపట్టుకుని పళ్ళుతోమడం ప్రారంభించింది. అప్పటికి నాకు పదిహేను వెళ్ళు. నావయస్సు నాకు సిగ్గుతెప్పించింది. 'ఊ' అని మళ్ళీకసిరి స్వంతంగా మొహంకడగడం మొదలెట్టేను. ఆమె అలాగే నుంచుంది. నావ్యవహారం గూడున్న ప్రెయిక్ లా కనబ డింది. 'నే కడుగుతాను ఫరవాలేదురా, నాయనా' అంది. ఆ మాటల్లో ఎంత తల్లిప్రేమ యిమిడిందో అర్థంకాదు. ఆమాతృ ప్రేమతో కూడుకున్న ఆమాట నన్ను ఒక్కసారి కలవర పెట్టింది రెండుసార్లు నేను ఆమెను గట్టిగా కసరడం నాకుజ్ఞప్తికివచ్చింది. ఆప్రేమ ఎంతకాఠిన్యాన్నైనా అసహ్యాన్నైనా మింగేస్తుంది. నాలో నేనే నాకాఠిన్యానికి మనస్సులో కించిత్కాలం కుళ్ళిపో యూను. 'ఏమే-అమ్మా-ఈవేళ ఇంత పెందరాళ్ళే లేపించావ్?' అనే చిన్నస్వరంతో కూడుకున్న మాట నిషించింది తల్లిని ఏమే అమ్మాఅని పిలవడం ఇప్పటివరకూ పోలేదు. ఒక్కొక్కసారి లోలోపల నవ్వొస్తూంటుంది ఈ సంబోధన జ్ఞప్తికి వచ్చినప్పుడు కొంచెం విచారంకూడా వేస్తూంటుంది. కాని నేనొక్కణ్ణే ఆలా పిలవటం లేదని సమర్థించుకుంటూ ఊరుకుంటాను.

'ఏమీాలేదు-ముందు అవశిష్టాలన్నీ కానియ్యి,' ఎందుకో ఈతొందర నాకర్థంకావటంలేదు. అన్నీ అయాయి. చద్దన్నందగ్గర కూచున్నాను. 'ఈవేళ-నీకెవరో పిల్లనిస్తామని తూర్పునుంచి

వచ్చారు. నిన్ను చూడ్డానికి వస్తారు. అంచేత చాకలి తెచ్చిన బట్టకట్టుకుని, శుభ్రంగా నున్నగా తలదువ్వుకొని ఎంతో మంచి వాడనిపించుకునేలాగ ఉండాలి' అందా మాతృహృదయం. ఆ హృదయంలో ఉప్పొంగుతూన్న ఆనందాన్ని గ్రహించలేం.

కొబ్బరినూనె పట్టుకొచ్చి తలకిపూసింది. తలదువ్వింది. నూనె ఎక్కువవడం మూలాన్ని చెంపలంట నుదురంట కార డం మొదలెట్టింది. నాలో నాకే ఊరికే నవ్వొస్తోంది. కారణం అర్థంకావటంలేదు. అమాయకమైన ఆ మాతృప్రేమని చూశా ? ఒకయింటివాణ్ణి అవదలచుకున్నందుకా ?

సరిగ్గా ఆ రెండింట్లోనూ దేనికి నవ్వొస్తోందో నిర్ధారణ కావటంలేదు. రెండూ నవ్వు తెప్పించేవే ? ఏనాడూ శుభ్రం గానూ, మంచిగానూ ఉండనిమనిషి ఎవరో ఎందుకో చూసిపో య్యేందుకు వస్తూంటే నేనలంకరింపబడ్డా ఎందుకు? బట్టల్లోనూ తలదువ్వుకోవడంలోనూ నేర్పరి అయిఉంటే చాలుకాబోలు!! తన పెద్దకొడుకుకి దూరాన్నుంచి పిల్లనిస్తామంటూ వచ్చేరనే ఆనందం ఆ మాతృ హృదయాన్ని అలా కలవరపరుస్తూంటడం లోకంలోని సామాన్య గుణమే!!

ఒకయింటివాణ్ణవతున్నానూ అనే సరదాకూడా వేసు కొచ్చింది. ఆ సరదా ఎంతవరకు ? పెళ్లికి బయల్దేరేసమయం దగ్గర్నుంచి ఆ బాజాలు చప్పుళ్లు వింటూంటేను ఆ పౌరోహి తుడు కార్యాన్నంతనీ చేయిస్తూంటేను సుమంగళి ఆ అమ్మా

యిక కంఠానికి పెనవేస్తూ చేతు మిగతా చిన్నచిన్న అలకపా
న్పులు వగైరాలు అయ్యేవరకూనే !!! పెళ్లయిన మర్నాడు
హృదయం ఎంతో బరువుగా ఉంటుంది, ఆ సుఖం క్షణమా
త్రమే !!

మా స్నేహితుడు మొన్నటివరకూ పెళ్లిచేసుకోరా
అని అంటే అగ్గిఅయిపోయేవాడు. 'ఏరా నీ కంత అసహ్యం ?'
అంటే 'జీవితంలో సెటిల్ అవనీరా,—ఇప్పటికే ఒక్క పొట్టకే
గడవడం కష్టంగా ఉంది—ఇంకో పొట్టనికూడా మెడకు తగి
లించుకుని దాన్నికూడా మలమల మాడ్చడం ఎందుకూ ?' అనే
వాడు. ఈసమాధానం కాస్త సమంజసంగానే ఉంది. ఈ దారి
ద్ర్య దినాల్లో పెళ్ళిళ్లు అనే మకకలయికలన్నీ పెట్టి ఎంత పెద్ద
చదువుచదివినా దమ్మిడీ సంపాదించలేకుండా ఉన్నవాళ్లకి
పెళ్లాల్ని అంటించడం చూస్తే ఈబాధపడేవాళ్లని ఇంకా హిం
సపెట్టవలదనుకుంటు రోషంతో మామలందరు కూతుళ్లని తగి
లించ దలచుకుంటున్నారే ! అని ఓ వింత అభిప్రాయం ఒక్కొ
క్కసారి మెరుపులా కనిపించి మాయమౌతూంటుంది.

అప్పటికి ఎనిమిది కొట్టింది. ఎంతో శ్రద్ధా భక్తులతోటి
చదువుకునేవాడిలాగ నా అంతట నేనే పెళ్లి అనేమాట వినడం
తోటే ఒక విధమైన ఆవేగమో, ఉత్సాహమో నాలో ఉబు
కుతూండడం మూలాన్న పెద్ద లావుపుస్తకం తీసేను. లావు
పుస్తకాలు మాక్లాసుకెక్కుతుంటాయి - అది డిక్షనరీ - ఏదో

రిఫర్ చేస్తూన్నట్టు పేజీలు ఊరికినే ఇటూ అటూ తిప్పడం మొదలెట్టాను చేతులు నెప్పెట్టుతూన్నట్టు కనిపిస్తోంది గాని నా హృదయం ఆవేశంతో దోబూచు లాడుతూన్నట్టు పేజీలింకా తీవ్రంతో ఇటూ అటూ గబ గబా తిప్పేస్తున్నాను ఈలోగా మానాన్న వచ్చారు. నా ప్రవర్తనంతా నవ్వుతెప్పించింది. గట్టిగా నవ్వేసాడు. ఒక్క నా నడవడికే కాదు నవ్వతెప్పిస్తే, మా నాన్నకి కొడుక్కి పెళ్లవుతుందనీ కోడలొస్తుందనీ సంబరంవల్ల కూడా నవ్వొచ్చింది

'ఒరేయి నువ్విలాగే ఇంకోగంటసేపు కూర్చో, ఈలోపుగానే వెళ్లి ఆయన్ని కలుసుకుంటాను' అంటూ అతని కాళ్లు జోళ్ల దగ్గరికెళ్లాయి.

'కతుకు తే అతుక'దన్న సామెతమూలాన్ని అవబోయే మామగారు మా మేనమామగారింట్లో భోంచేసి అక్కడే రాత్రిగడిపి ఉదయానే కాఫీకూడా ఆరగించి నా దర్శనంకోసం ప్రయాణం అవుతున్నారు. ఆవేళ శనివారం అవడంమూలాన్ని పొద్దున్న ఏడుగంటలవరకూనో 8 గంటలవరకూనో దుర్ముహూర్తంవేళ అవడంవల్ల ఇంకా నిరీక్షిస్తూ కూచున్నారు. మానాన్నా సరిగ్గా దుర్ముహూర్తంవేళ దాటడం తరవాయిగా గబగబ వారికి ఎదురు సన్నాహం వెళ్ళి ఆహ్వాన పత్రాన్ని అందిచ్చాడు.

మా యింటిముందర బండివచ్చేసియింది. వెయ్యి తేళ్ళూ జెర్రులూ నాదేహంలో పాకుతున్నట్టుంది ఒకవిధమైన భీతి

చేత కళ్ళు కాళ్ళూ తొట్రుపడుతున్నాయి. ఆయన వచ్చేశారు కదా అని నాబుర్ర అప్రయత్నంగా పుస్తకంమీదకి వంగింది. అది చూసి ఆయనమనస్సులో నవ్వుకున్నాడు. గొప్పశ్రద్ధగా చదివే కుర్రాడనిపించుకోడానికి ఈప్రయత్నాలన్నట్టు ఆయన గ్రహించాడు. ఆయనపెదవులు వెనక్కితోశాయి.

అలాంటప్పుడు నేనుకూడా లేచి ఏదో ఎటికెట్‌కి భంగంరాకుండా 'దయచెయ్యం'డనో 'కూచోం'డనో అనేసి పుస్తకమ్మీద చెయ్యిఆని ఆయనకేసి ఓసారి విచిత్రమైన చూపుల్ని విసురుతూ కూచుంటే నాలోఉన్న తెలివితేటలూ సమయస్ఫూర్తి కనబడును. అదేప్రథమం అవడంమూలాన్ని అనుభవం తక్కువవడంచేత ఏదో వెర్రిమొర్రిచేష్టలు, నటన చేసాను. 'ఈఅబ్బాయికి కంగారెక్కువ' అనుకున్నాడా అని నేను తర్వాత అనుకుని బాధపడ్డాను. నాకెప్పుడూ ఆనమాయితే సమయంలో సరిగ్గా నటించకుండా మొద్దబ్బాయిలా ఉండడం తర్వాత అరెరె ఇలా ఇలా చెయ్యవలసింది చేశాంకాం అని ఫీలవడమూను- ఆ విధమైన ప్రవర్తన మార్చుకోవడానికి నా తాతలు దిగొస్తున్నారు.

కుశల ప్రశ్నలు అయినతర్వాత వ్యవహార విషయాల చర్చ జరిగింది- ఏవో బేరాలుకూడా అంత Plain గా కాకపోయినా ఆ అభీష్టంఉన్నట్టు చూచాయగా తేలడం కూడా సంభవించింది- మామగారు బాగా తడిఉన్నమనిషి కాబట్టి పిల్ల

ఎదిగి ఉండడం మూలాన్ని తొందరపడి నాన్న నోటంమ్మాట వచ్చింది. వేదాక్షరంలా చూచాడాయన. అమ్మ, ఇంట్లో ఉన్న వాళ్ళూ, చంకలెగరేస్తున్నారు.

పిల్లని చూడ్డానికి మీ అబ్బాయిని పంపిస్తే పంపించం డి! అన్నారాయన. "సరే" నని నాన్న అంగీకారాన్ని తెలుపు తూ 'ఏరా!' అని నా కేసి తిరిగేడు. దగ్గర దగ్గరగా కలకత్తా వెళ్లాలి- కూపస్థ మండూకంలా ఉన్న నాస్థితిని ఇప్పుడు మార్చు కోవచ్చునసే ముఖ్యోద్దేశంతో "ఊ" అన్నాను.

హాయిగా ప్రయాణం చేసి శాస్త్ర ప్రపంచజ్ఞానాన్ని సం పాదించుకొన్నాను. పిల్లకూడా నాకు సంతృప్తిగానే ఉంది. నాకు సేవచేసే పిల్ల ఇంకత్వరలో రానున్నదన్నమాట. సేవచే యించుకోటానికి దమ్మిడీ అర్హతలేని మానవజీవులకు కూడా వారిజీవితాల్లో ఆడపిల్ల చేత సేవచేయించుకోవడం తప్పటంలేదు! అర్హతా అనర్హతా ఏమిటీ అదొక సాంప్రదాయం, శాస్త్రం తప్పలిసరి అయి కూచుంది.

హృదయపూర్వకంగా ఆహ్వానించాను.

చుట్టాలకీ పక్కాలకీ తెలిసింది. 'రామిగాడికి పెళ్ళిట్రో య్' అంటూ హేళనచేశారు కొంతమంది. అవును- పెళ్ళికొడుకు లెక్కడా దొరకడంలేదు పిల్లలకి. అయినప్పుడు అనాకార్లకీ ఇవ్వాక, డబ్బులేనివాడికి ఇవ్వాక, ఇంట్లోపిల్లని ఎదగబెట్టుకూ చుంటారేమిటి? అంటూ పాము చావకుండా మాట్లాడేరు లిటి

గెంట్సు, లోకం ఎలాఅనుకుంటున్నా ఈ మాట్లకి నాదగ్గర బంధువులు మనస్సునొచ్చుకున్నా నిజం చెప్పొద్దు నాకుమాత్రం బ్రహ్మానందంవేస్తోంది. శుభ ముహూర్తాన్ని నిరీక్షిస్తున్నా పనులు జోరుగా జరిగిపోతున్నాయి. ఫ్రెండ్సునందర్నీ ప్రయాణం కట్టమన్నాను. అన్నీ రెడీఅయాయి.

ఇంతలోనే బాంబులా ఓకుత్తరం వచ్చింది. అందులో, మా ఋషులు వాళ్ళఋషులూ ఒక్కరే అయార్ట. అంచేత పెళ్ళిచెయ్యడం శుభకరంకాదు అన్నారట పెద్దలంతాను. అంతా సిద్ధపరచుకున్నాం. డబ్బు దండగ అయింది. అంతా ఒకళ్ల మొహం ఒకళ్ళు చూచుకున్నారు.

ఇంతకీ ఘటన ఉండొద్దూ- పెళ్ళిజరగడానికి- మనఇష్టమా? దైవఘటన !

గృహలక్ష్మి ఆగష్టు 1941.

---

# విషణ్ణ హృదయం.

అదో చిన్నసందు. ఆ సందులో వదే ఇల్లుమాది. సముద్రంవారే వాటిస్థలం. ఆసందులో నేను అదే మొదటిసారి చిట్టిని కలుసుకోవడం. చిట్టికి ఆరేళ్లున్నాయి చిదానంద స్వరూపం. ఆమెకళ్లలో నూతన ప్రపంచనిర్మాణం కనబడుతూంటుంది.

“చిట్టీ ! ఏమిటి ఇంతచక్కగా ముస్తాబు అయావీవేళ ? బళ్ళో కెళ్ళుతున్నావా ?”

"అబ్బే! లేదు. మా నాన్న ఈచొక్కాలు తొడుక్కోమన్నాడు. ఈ వేళ మా చాకలాడు బట్టలు తెచ్చాడు." అంది నవ్వుతూ.

"మీ నాన్నే!" అన్నాను ఆశ్చర్యంతో. వాళ్ళనాన్న రెండో వివాహం చేసుకోవడం, పెళ్లాం సుస్తుచెయ్యకపోవడం, ఇవి జ్ఞాపకానికొచ్చాయి. హరిరావుకి రెండో పెళ్ళి అన్నమాటే కాని ఇంకా పాతికేళ్లు నిండలేదు.

"అవునండీ! మా నాన్నగారే! ఇంకెవరు తొడుగుతారు. మానాన్న మాఅమ్మా ఆయనేకదూ!" అంది.

ఆ చిరుతేత హృదయంలోనించి ఈ మాటలు రావడంతోటే నన్ను ఆశ్చర్యం, విషాదంకూడా ఆవరించాయి. పాపం! తల్లి లేదు—తల్లి లేని తండ్రి పినతండ్రితో సమానం. చిట్టికి తల్లి చనిపోయినదనే విషయం తెలియకూడదనే ఆలస్యం చెయ్యకుండా రెండో వివాహం కూడా చేసుకున్నాడు. కాని హరికి సంసారసుఖం కలిగే భాగ్యం లేకపోయింది!

సూర్యుడు పొలాల్ని చెట్లని రక్తసిక్తం చేస్తున్నాడు. పశ్చిమాంబుధిలో క్రుంగుతూ ఉన్నాడు.

"చిట్టీ! మీ ఇంటికెళ్ళదాం పద. సాయంత్రం అయింది" అంటూ ఆ చిట్టి హస్తాల్ని పట్టుకుని వాళ్ళింటికి వెళ్ళాను.

హరిరావు ఇల్లు పరిణామం చెందింది. చంద్రుడు లేని రాత్రిలా ఉంది వేలవంగాను. ఇంట్లో ఎవరూ ఆడదిక్కు లేరు. హరి ఒక్కడే ఎలాగో కాలక్షేపం చేస్తున్నాడు.

చిట్టిని వాళ్ళింటిదగ్గరికి తీసికెళ్ళి కిటికీలోంచి తొంగి చూశాను. లోపల ఒక కుక్కి మంచంమీద హరి మోకాలి మీద మొహం ఉంచుకొని రెండుచేతుల్తోటీ మొహం మూసుకుని కూచుని ఉన్నాడు.

ఆ సమయంలో చిట్టి వెళ్ళకూడదని అనుకున్నాను హరి యింటిప్రక్కనే గుర్రపుశాల ఉంది. చిట్టిని ఆగుర్రాన్ని చూస్తూ ఉండమన్నాను. చిట్టి బండిలో కెక్కి కూర్చుంది.

“హరీ! ఎందుకురా అంతలా విచారిస్తావ్ !” అన్నాను అతని మొహం ఎత్తుతూ.

“పోయిందిరా! నన్ను విడిచిపెట్టి—పోయింది” అన్నాడు శ్రీహరి.

“పోనిద్దూ! అది మన మంచికేవచ్చిందేమో” అన్నాను నేను.

మళ్ళీ హరి బుర్రవాల్చుకుని వెక్కి వెక్కి ఏడవడం మొదలెట్టాడు. ఆభాష్పాలు అతని నేత్రాలకి కొత్త.

“ఇప్పుడు నువ్వు స్వేచ్ఛగా ఉన్నావు. దాని దారి దానిది—మనదారి మంది.” అంటూ ఊరుకోపెట్టాను.

“నాకు స్వేచ్ఛ లేదురా! దాన్ని విడిచిపెట్టను—విడిచి పెట్టలేను —మళ్ళీ వెనక్కితీసుకొస్తా వెళ్ళి” అప్రయత్నంగా వస్తూన్న విచారాన్నాపుకుంటూ అన్నాడు.

బయట్నుంచి చిట్టి పాటపాడుతూ వస్తూన్నట్లుంది. చిట్టి గానసుధాలహరి నామేనుని వణికిస్తోంది ఝల్లుమంటోంది.

"ఒరేయ్! రావ్రా! నా చిట్టి ఏస్తూన్నట్టుంది — దానికి తెలియకూడదు రోయ్ ఈవిషయం" అన్నాడు శ్రీహరి భయమేస్తూన్నట్టు !

"అబ్బే! నే చెప్పలేనులే"

"నా చిట్టిని తీసుకెళ్ళతాను. ఈ చిట్టిని చూస్తేనా, చిట్టి కోసమైనా నా యింటికి రా అని బతిమాలతాను. దాన్కి చిట్టిని ఎరగావేస్తాను ఏమంటావురా! రావ్రా!"

"అది కష్టసాధ్యమేమోరా! అవంధా అపాయకరంగా కనిపిస్తోంది. కష్టంగాకూడా వుంది. అయినా! పోని! ప్రయత్నిద్దాం." అన్నాను.

"నువ్వుకూడా నాకుతోడుగా ఉండాలి. తప్పక ఈమిత్రుడికి తోడ్పడతావని తలుస్తాను." అన్నాడు హరి.

కమలని వెతికి డానికి — మర్నాడు మేం ముగ్గురం బయల్దేరాం. చిట్టి మా చేతుల్లోనే ఉంది.

కమల్లో నవయౌవనం తొణికిస లాడుతూంటుంది. కోమలహృదయం. శ్రీహరి వివాహం చేసుకున్నాడు. స్త్రీది చంచలహృదయం. కొన్నాళ్లయిన తరువాత హరిని, చిట్టిని ఒదిలేసి ప్రభాకర ప్రణయ సామ్రాజ్యంలో సింహాసనం వేసుకు కూచుంది.

కమల పట్టణం పారిపోయింది. శరీరాల్ని కొనుక్కొని సుఖిస్తూ, ఆ బానిసల అధరోష్టామృతాన్ని గాజుకప్పుల్లో పో

సుకుని తాగుతూ, తందనాలాడుతూ ఉన్మత్తులై కాలం గడ పుతూంటే ధనవంతులుంటారా వాళ్ళో.

కమల్ని ఒంటరి గాఉండగానే కనుక్కున్నాం. విలువైన దుస్తులను ధరించింది. ప్రేమికుని కోసం ఎదురుచూస్తూ ఆరాతి కుర్చీపై కూచుంది.

"హరి! నే వెళ్లి మాట్లాడతాను—నువ్వు నిశ్శబ్దంగా ఉండు" అన్నాను నా మిత్రుడుతోటి.

కమల్ని చూడగానే నేనన్నమాటలు వినబడలేదు హరికి. కంగారుతో గబగబా వెళ్ళి గద్గదస్వరంతో "కమలా! నీకోస మే వచ్చాను నిన్ను తీసుకెళ్ళడానికి. మన ఇంటితలుపులు నిన్నా హ్వానిస్తున్నాయి. ఇంకా తెరిచేఉన్నాయి. మనం సముద్రం ఒడ్డుకి పోదాం—ఏకమౌదాం. చూడు చిట్టిని—నీ కోసం బెం గెట్టుకుంది చిట్టికోసమైనా వచ్చి నన్ను ధన్యుణ్ణి చెయ్యి" అన్నాడు కమలతో.

కమల ఆపాదమస్తకం వణుకుతూ మాట్లాడక విగ్రహం లా అలాగే నించుండిపోయింది.

"కమలా! నా హృదయాన్ని భేదించకు" అన్నాడు మళ్ళీ గట్టిగా హరి.

విసుగుమొహంతో మమ్మల్ని పొమ్మన్నట్టు మాకేసి చూసింది. నాకుమాత్రం ఒళ్లు మండిపోతోంది. పసిబిడ్డని చూ ట్టంలేదు—భర్త ప్రాధేయపడి కోరడానికి వచ్చాడు—అయినా

అతనికైనా చూట్టంలేదు—"అంతనీచంగా ప్రవర్తించకూడదు" అందామని అనుకున్నాను. నా పెదవుల చివరదాకా వచ్చాయి కాని వీరి కలయికకు నా మాటైనా భంగమవుతుందేమో అని నా ఉద్రేకాన్నాపుకొన్నాను.

ఇంతట్లోకే ఆమె రాజు వచ్చాడు.

శ్రీహరి మొహం అంతా చెమట్లెక్కింది.

మమ్మల్ని చూసి ప్రభాకరం వెకిలినవ్వు నవ్వాడు. అసూయాపూరిత దృక్కులు ప్రసరింపజేసాడు మా మీద. కమల ప్రక్కకిచేరి ఆమె బుజాలపై చెయ్యివేసి నిలబడ్డాడు. మాకు వాణ్ణి ఖూనీచేద్దామా అని అనిపించింది.

"మిష్టర్! ప్రభాకర్! ఈకమలని తీసుకువెళ్లడానికి వచ్చాం. ఆమెభర్తకి ఇచ్చేయడం నీవిధి. విశ్వాసఘాతకురాలైన ఓస్త్రీని చెరపట్టి, మర్యాదస్థుల హృదయాల్ని విషణ్ణహృదయాలుగా చేయడం భావ్యంకాదు. నామాటవిని అలా చెయ్యి" అన్నానాకమల హృదయరాజుతో.

చిరునవ్వే నాకిచ్చిన జవాబు.

ఇంకా మాట్లాడదాం అనుకున్నాను. కాని యింతట్లోకే హరి నాముందుకు త్రోసుకుంటూ వచ్చి ప్రభాకరుని కెదురుగుండా నిలబడ్డాడు.

ప్రభాకర్రావూ శ్రీహరి ఒకరి కొకరు ఎదురుగుండా నిలబడ్డారు. అభిముఖంగా ఉండడమే కాని వా రిరువురి నోట

మ్మటా వాక్యంగాని చర్యగాని రాలేదు. ఆ దృశ్యం నా మన స్సులో తలచుకున్నప్పుడల్లా గోచరిస్తూంటుంది.

హరి, ఎర్రగా ఉన్నాడు. అందమైన కళ్లు. వినయగుణ సంపన్న హృదయుడు. మర్యాదైనముఖం. ప్రభాకరుడు, ప్రేమికుడు, ఖరీదైనదుస్తుల్తో, వాలినమొహంతో, నిస్పృహ చెందినవాడులా కనబడుతున్నాడు.

ఒకరినొకటమ్మటా మాటరావటంలేదు. అయిదునిమిషాలు గడిచేయి. ఈ దృశ్యాన్ని చూడలేకపోయింది కమల. హఠాత్తుగా ప్రభాకరుని భుజాలపై వాలింది. తక్షణమే కళ్లు మూసుకున్నాడు శ్రీహరి ఆ దృశ్యాన్ని చూడలేక. "పోదాం పదరా రావ్వూ, లాభంలే...దు..." అన్నాడు.

ఇంటిమార్గం పట్టాం మేం మధ్యగురపూరాను. ఆ పట్టణంలో మాత్రం ఆరాత్రికి ఉండవలసివచ్చింది. తెల్లారకట్ట ట్రెయిను వెళ్ళుదామని నిశ్చయించుకున్నాం.

రాత్రి శ్రీహరి మనస్సు ఈ ప్రపంచంలోలేదు. పరుపుమీద పడుక్కొని ఏదో తలచుకుంటూ ఓమాటు వెర్రినవ్వు, ఓమాటు ఉద్రేకపూరిత వాక్కులు, ఓసారి విచారం ! ఇలాగే విశ్రాంతిలేకుండా శ్రీహరి పేలుతూన్నాడు. నేనూరుకోపెట్టాను. ఎంతసేపు వాదించినా ఓ అరగంటవరకూ నా మాటలు వినలేదు.

హఠాత్తుగా పరుపుమీంచి ఎగిరేడు. "ఒరే—రావూ! నామనస్సు ఇప్పుడురా సుఖంగాఉంట—పోనీ—పోతేపోయిం ది. వెధవముండ—వ్యక్తిని—హృదయాన్ని అర్థంచేసుకోలేని స్త్రీతో కాపురంచెయ్యడంకూడ అసహ్యాకరమే—మాదిట్టిపో షణకి ఓనర్సుని పెడతాను. వస్తే—మనస్సు తిరిగి—రానిస్తాను అదైనా ఓవారం రోజుల్లోపుగా—లేదా! పోనీ పాడుముండని దానిమొహమైనా చూడను" అంటూ ప్రతినచేశాడు.

క్రమేణా రోడ్డుమీద అల్లరి తగ్గుతోంది. ట్రాంబళ్ళూ బస్సులరోద ఆగుతూ ఆగుతూంది. నిద్రపోతున్నాం.

అర్థరాత్రయింది. మాకు సరిగ్గా నిద్రపట్టడంలేదు. మా రూమ్ తలుపుల్ని ఎవరో తట్టినట్టయింది. హరి కంగారుతో లేచి తలుపు తీసాడు.

నిరాశారేఖలు ఆముఖంపై ప్రస్ఫుటంగా కనిపిస్తు న్నాయి.

"చిట్టే !"

"కమలా ! ఏం ఇలావచ్చావ్ ?"

"కమల మాట్లాడలేదు.

శ్రీహరిగుండె నీరయింది.

"కమలా !......"

"మీ కోసమే !......"

"ఏం ? ప్రభాకరుడు నిన్నే మైనా............... పొమ్మన్నాడా ?......"

కమల కళ్ళు నీళ్ళతో నిండాయి.

"లేదు. నాకు పెళ్ళవలేదని ప్రభాకరునితో చెప్పాను. అంచేత అతనికి కోపంవచ్చి గెంటేశాడు."

"నీ పెళ్ళికి ఊళ్ళో లేడా ?"

"లేదు...బొంబేలో ఉండేవాడు...అంతక్రితం నేనూ ఆతనూ క్లాస్ మేట్సు...విద్యార్థిదశలోనుంచికూడా మాహృదయాలు ఒకటే"

"కమలా ! నీ పవిత్రప్రేమకి నేను భంగంచేశాను... క్షమించు......ప్రభాకరునితో నే చెప్తాను... ...గాఢంగా హత్తుకుపోయిన హృదయాలు మీావి..."

"వద్దు... ... ...నమ్మించి ద్రోహంచేశాను... ... ... లోకాన్ని... ..."

"కమలా ! ...సరేలే... తెల్లారకట్టే మన ప్రయాణం ... లేపుతాను... పడుకో ..."

తెల్లారకట్ట ట్రెయిన్ కే మేంవెళ్ళాం.

హరి కమలల ప్రణయ జీవనం సుఖప్రదంగా ఉంటుందనే ఆశారేఖలు నాహృదయంలో ఉద్భవించాయి.

* * * * *

మర్నాడు హరిని కమలిని చూద్దామని సాయంత్రం వాళ్ళింటికెళ్ళేను. అప్పటికప్పుడే వాళ్ళిద్దరూ చిట్టితో బీచ్ కి పోయారు. తలుపు తాళంవేసి ఉంది.

చాలదూరంలో వారి బింబాలు అనునా యి—

## మపాసాం కథలు

[ ప్రఖ్యాత ఫ్రెంచి కథలు ]

వింజమూరి శివరామారావుగారి అనువాదం

## కమలం కథలు

[ చక్కని సాంసారిక కథలు ]

శ్రీ రామమోహన్

## ఆ రాత్రి

[ నాటికలు ]

శ్రీ కాజ పద్మనాభరావు

---

SWARNALATHA PUBLICATION ..

MADHUKARI by MADHUMURTY